

గుంటలుపడ్డ కళ్లు



'బక్క చిక్కిన తాత'

—శిల్పి : శ్రీ చ్యవన్ నరసింగరావు.
(పాకాల)



'చీకటిలో వెలుగు'

చి॥ ఎ. వి. ఎస్. ఆర్. జోస్యులు (గుంటూరు)
రచించిన రేఖాచిత్రం

సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతిక 4 అ

# ఆంధ్రపత్రిక

Founder K NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 32
16-4-52

నందన సంవత్సర చైత్ర బహుళ సప్తమి బుధవారము

## విషయానుక్రమణిక







గవర్నర్ శ్రీ ప్రకాశ, ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగార్లు

వ్యాఖ్యలు, విమర్శలు

# రాజాజీ మంత్రివర్గం

రాజాజీ మంత్రివర్గం గురువారం 10 వ తేదీని ప్రమాణ స్వీకారం చేసింది. పది రోజులపాటు వివిధ నాయకులతో చర్చలు జరిపి 15 మందితో మంత్రివర్గాన్ని నిర్మించగలిగారు. ఒకరిద్దరు తప్ప కొత్త మంత్రివర్గంలోని మంత్రులందరూ రాజకీయరంగంలోనూ, సహకారోద్యమం లోనూ, విద్యావ్యాపన కృషిలోనూ దేశానికి పరిచితులైనవారే. ఒక విధంగా చూస్తే తెలుగు మంత్రులు అయిదుగురనవచ్చు మరోవిధంగా చూస్తే ఏడుగురనవచ్చు. డా॥ మల్లవరపు వెంకటకృష్ణారావు శ్రీ బులుసు పట్టాభిరామారావుగార్లు కోస్తా జిల్లాల వారు. యన్ రంగారెడ్డి, యన్ శంకరరెడ్డి, డి సంజీవయ్యగార్లు రాయలసీమవాసులు. ఆర్ నాగన్నగౌడ్ గారు బళ్లారి జిల్లాకు చెందినవారు. శ్రీ వెంకటస్వామినాయుడుగారు మద్రాసు నగరవాసి, తిరుపతి దేవస్థానం ట్రస్టీషిప్ కమిటీ చైర్మన్ వీరి మాతృభాష తెలుగే. మద్రాసు జిల్లా తమిళనాడు కాంగ్రెసు సంఘ సభ్యులు మద్రాస్ జిల్లా ఆంధ్ర కమిటీ సభ్యులుగా ఉండేవారు కాని రెండేళ్ల కిందట తమిళనాడుకమిటీ సభ్యత్వం మార్చుకున్నారు. కన్నడులైన డా॥ యమ్ కృష్ణారావు గారు కూడా మొదట మద్రాసు జిల్లా ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ సభ్యులైనా తరవాత తమిళ కాంగ్రెస్ కమిటీకి మారారు.

మంత్రివర్గంలో రాయలసీమకు నలుగురు ప్రతినిధులున్నారని చెప్పకోవాలి. రాయలసీమ ఆర్థికపరిస్థితి కర్నూలు అంగా

ఉన్న ప్రస్తుతసమయంలో ఆప్రాంతంలో ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమాలు కొనసాగడానికి ఇప్పుడు అధికావకాశాలుంటాయనుకోవచ్చు ముఖ్యంగా పబ్లిక్ వర్క్సు శాఖ రాయలసీమ ప్రతినిధికే ఒప్పగించినందువల్ల ఆ ప్రాంతంలో అత్యవసరమైన నీటి సరుపాయానికి కార్యక్రమం చురుగ్గా సాగిపోతుందని ఆశపడవచ్చు ఆహారశాఖ కూడా రాయలసీమ ప్రతినిధికే ఇస్తే బాగుండేది. డా॥ యం వి కృష్ణారావుగారికి విద్యాశాఖ, శంకర్రెడ్డిగారికి స్థానికసంస్థల శాఖ ఇవ్వడం ఆయా రంగాలలో వారు అనుభవజ్ఞులైనందువల్లనే జరిగిందనకోవచ్చు అయితే ఒకరికి పని మరీ ఎక్కువ ఒకరికి మరీ తక్కువా ఇవ్వబడింది త్వరలోనే శాఖల పంపిణీలో మార్పులు అవసరం కావచ్చు

ఈ మంత్రులలో చాల మంది ఇటీవల కాంగ్రెస్‌లో వచ్చిన కలతలతో అంతగా నిమిత్తం పెట్టుకోనివారే ఉన్నారు కొత్తగా వచ్చిన పార్టీలతో వీరి కంతగా వైరంలేదు డెమోక్రటిక్ ఫ్రంట్‌కి చెందని వారూ కాంగ్రెస్‌కి చెందనివారూ మొత్తం ఏకైమందివరకూ ఉన్నారు ఈ ఏకైమంది తోడ్పాటూ శాసనసభలో మంత్రి వర్గానికి లభించే అవకాశం కలుగుతోంది. మిశ్రమ మంత్రివర్గాన్ని స్థాపించనవసరం లేకుండా (కామన్వీల్ పార్టీ నాయకుడు మాణిక్యవేలు నాయకర్ ఒక్కరు మినహా) సుస్థిరమైన కాంగ్రెస్ ప్రభుత్వాన్ని రాజాజీ స్థాపించ గలిగారని చెప్పవచ్చు.

మద్రాసు కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకత్వానికి సమ్మతి తెలుపుతూ పార్టీలో ప్రసంగించిన రోజున శ్రీ రాజగోపాలాచారిగారు ఒక ముఖ్య సూచన చేశారు శాసన సభ్యులు ప్రభుత్వాధికారుల కార్యకలాపాలజోలికి పోరాదని వారు చేసిన ఆ సూచన ఈనాడు ఆచరణలో పెట్టడం చాల ముఖ్యం పరిపాలనలో అవినీతికి అదే ముఖ్య కారణమని రాజాజీ అభిప్రాయం అది రాష్ట్రంలో అందరికీ అనుభవమైన విషయం కూడా

ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు ప్రమాణం స్వీకరించినరోజు రాత్రి రేడియోలో ప్రసంగిస్తూ ప్రజ లందరూ ప్రభుత్వంతో సహకరించాలనీ, వర్గాలకోసమూ పేదలకోసమూ దైవప్రార్థనజరపాలన్నారు. కులభేదాలు, వర్గవ్యత్యాసాలు, రాజకీయ వైరాలనుగురించి అసలు తలపురానీయకూడ

(47-వ పేజీ చూడండి)



ఢిల్లీ రాష్ట్రపతిభవనంలోని జాతీయ ప్రదర్శనశాలను దర్శిస్తున్న అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్

# ★ మద్రాస్ డైరీ ★

## ఆడవాళ్ళకి అన్యాయం

ఆడవాళ్ళకి ఇంకో అన్యాయం జరిగింది. సంఖ్యాధిక్యతలో మగవాళ్ళకి పై చెయ్యి అనిపించుకుని, అన్ని రంగాల్లోనూ ముందడుగు వేస్తున్న ఆడవాళ్ళకి మళ్ళీ అన్యాయం జరిగింది. మద్రాసు రాష్ట్ర శాసన సభలో ఆడవాళ్ళ బలం చిక్కిపోయి నాలుక్కి దిగింది. నాయకునికోసం వారాలూ పక్షాలూ గాలించి తెచ్చిన కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీలో పధ్నాలుగు మంది మంత్రిసహోదరులు దొరికారు గాని రాజాజీకి ఒక్క మంత్రి(ణి) సోదరి దొరకలేదు. 1937 లో రాజాజీ మంత్రివర్గం నిర్మించినప్పుడూ అంతే.

ఆడవాళ్ళ విషయంలో 1946 ఎన్నికలే నయం. కోరినంతమందిని కాంగ్రెస్ నిలబెట్టింది. వాళ్ళంతా గెలిచారు. కాని ఈ మాటు ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ నిలబెట్టినవాళ్ళ సంఖ్యా తక్కువే. వీళ్ళలో గెలిచినవాళ్ళు మరీ తక్కువ. మైనారిటీ అనడమే కాని మెజారిటీగా ఉన్న ఆడవాళ్ళ నీవిధంగా అణిచెయ్యడం వోటర్లకు మంచిది కాదు. ముందు ముందు ఆడవాళ్ళు గట్టిగా నడుం కట్టుకుంటే ముప్పే సంభవిస్తుంది.

అసలీ ఎన్నికల్లోనే పెద్ద లోపమొకటి కనపడింది. చెన్నరాష్ట్రంలో, ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఆడవోటర్ల సంఖ్య మగవోటర్ల సంఖ్యకంటె అధికం. అయితే వోట్లు వేసిన ఆడవాళ్ళు చాలతక్కువమంది. మధ్యతరగతి అని చెప్పబడుతున్న జనంలోనూ, పై తరగతి జనంలోనూ వోటర్ల లిస్టుల్లోకి ఎక్కినవాళ్ళే తక్కువ. వోట్లు వేసినవాళ్ళు మరీ తక్కువ. మధ్యతరగతిలో రెండో రకం (నాసిరకం అంటే కోపాలొస్తాయి) మూడో తరగతి జనంలో ఆడవాళ్ళు మాత్రం చాలమంది చీకటితోనే చద్దికూడు తినివచ్చి క్యూల్లో నిలబడి వోట్లు వేశారు. ముఖ్యంగా ఇటువంటి వాళ్ళవల్లనే ఆంధ్రదేశంలో ఎన్నికలు చాలా తారుమారయినాయట. అందువల్ల ఆడవాళ్ళు తల్చుకుంటే ఎంత ముప్పో ముందే గమనించి రాజకీయ పార్టీలు జాగ్రత్తపడ్డం మంచిది.

## చెన్నపట్నంలో తెలుగు

చెన్నపట్నంలో తెలుగు విద్యాబోధ గురించి ప్రభుత్వ నియామకంవల్ల విచారణ జరిపి నివేదిక తయారుచేసిన కత్తి వెంకటస్వామి నాయుడుగారు మంత్రివర్గంలో చేరారు కాబట్టి, ఈమారైనా ఎక్కడో పాతిపెట్టబడిన ఆ నివేదికని తవ్వితీసి ప్రభుత్వం అమలుజరుపుతుందని ఆశ కలుగుతోంది. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు కార్యకలాపాల్లో చాలకాలం అనుభవం గడించిన విద్యామంత్రి డా॥ మల్లవరపు కృష్ణారావుగారీ విషయంలో శ్రద్ధ వహిస్తారని ఆశపడవచ్చు.

* * *

ఈ మధ్య మద్రాసు కార్పొరేషన్ కౌన్సిల్‌వారు ఒక తీర్మానం చేశారు. చెన్నపట్నంలో నీటి కరువు తీర్చడానికి గాను కృష్ణా-పెన్నా ప్రాజెక్టు నిర్మాణానికి భారతప్రభుత్వాన్ని ఒప్పించాలని మద్రాసు ప్రభుత్వానికి విన్నవించుకోడం తీర్మానం ఆంతర్యం. ఈ ప్రాజెక్టులు రాజకీయాల రభసలో పడిపోయినందువల్ల ఈ ఊబిలోనుంచి ఉద్ధరించడానికిగాను కేంద్రప్రభుత్వం ప్లానింగ్ కమిషన్ కమిటీ పరిశీలనకు వచ్చి వెళ్ళిన సమయంలో ఈ తీర్మానం జరిగింది. ప్రభుత్వం చెప్పిన లెక్కల ప్రకారమే నూరింట ఇరవై పాళ్ళకు తక్కువలేని ఆంధ్రులకు చెన్నపట్నం కార్పొరేషన్ స్కూళ్ళలో అయిదోవంతు కాకపోతే పదోవంతైనా తెలుగు విద్యాబోధనకి ఏర్పాటు చెయ్యలేకపోయిన కార్పొరేషన్‌వారే ఈ తీర్మానం చేశారు.

విద్యాశాఖాధికారులూ, కార్పొరేషన్ అధికారులూ చెప్పే మాటల్ని బట్టిచూస్తే చెన్నపట్నంలో తెలుగువారికి పిల్లల్ని చదవనియ్యడం బొత్తిగా ఇష్టంలేదనో, చెన్నపట్నంలో నిరక్షరాస్యులంతా తెలుగువారే అయుండాలనో, లేదా సంతాననిరోధవిధానాన్ని తెలుగువారు నూరింట నూరుపాళ్ళు అఖండవిజయంతో సాధించేశారనో అనుకోవలసి వస్తుంది.

* * *

నీటికీ చదువుకీ సంబంధం లేదు కనక చదువులమాట అట్టే పెడితే కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టువల్ల కాని, కృష్ణానదివల్ల కాని నీటికరువు తీర్చుకోవలసిన అక్కర చెన్నపట్నంకంటె రాయలసీమకి ఎక్కువని చెప్పాలి. చెన్నపట్నంలో నీటికోసం రు 160 కోట్ల ప్రాజెక్టు కావాలని మద్రాసు కార్పొరేషన్ వాదిస్తోంది. ఈ లెక్కని చిత్తూరులో బిందె బేడా పావలా మొదలు బ్లాక్ మార్కెట్‌లో అర్థరూపాయివరకూ మంచినీరు కొనుక్కుంటున్నవారెంతెంత ప్రాజెక్టులు కోరవచ్చో తెలియదు. రాయలసీమ అంతటా నీటికరువు తీర్చాలంటే ఏం చెయ్యాలో తెలియదు. కార్పొరేషన్ తీర్మానాలు, ప్రాజెక్టుల రాజకీయాల రణగొణ ధ్వనిలో కృష్ణానదికి అందుబాటులో ఉన్న గుంటూరులో నీటికరువుగోడు ఎవరికీ వినపడదు. ప్లానింగ్ కమిషన్ పంపిన కమిటీవారు ఇరిగేషన్ ప్రాజెక్టులతోపాటు ఆయా ప్రాంతాల మంచినీళ్ళ అవసరాల్ని కూడా పరిశీలించి ఉంటే బాగుండేది.

* * *

ఈ మధ్య చెన్నపట్నంలో (దరిదాపుల్లోనూ) దారిదోపిళ్ళు ఎక్కువయ్యాయి. దారిదోపిళ్ళకీ ఇళ్ళకి కన్నాలు వెయ్యడానికీ చాలా తేడావుంది. ఇళ్ళకి కన్నాలు

(4 వ పేజీ చూడండి)



రాజమండ్రి వాగ్వర్ధనీ సమాజంవారి ఉపన్యాసపుపోటీలో పాల్గొన్నవారితో శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు పోటీలో బహుమతిపొందినవారు వి. యస్. శ్రీనివాసదీక్షితులు, గొబ్బూరి హనుమాయమ్మగార్లు.



# తెలియని వ్యథ

శ్రీ పిడపర్తి వెంకటరమణ

హల్లో! అన్నా 'మీ అమ్మ ఏమన్నదో తెలుసా?' అన్నాడు సౌజన్యారావు సోఫాలో కూర్చొని పుస్తకం చదువుతున్న సరోజని చూసి.

'ఏమంది నాన్నా?' అని నిశ్చలంగా నెమ్మదిగా ప్రశ్నించింది. కూతురు వైఖరికి తను కూడా చలించేడు.

'నీ భర్తతో కాపరం చేయనన్నావుటగా!'

'అమ్మ చెప్పింది నిజమే నాన్నా'

'ఆఁ ఏమిటి' విపరీతాశ్చర్యంతో నోట మాట రాలేదు. నీరసంగా దగ్గరగా నున్న సోఫాలో కూలబడ్డాడు.

సరోజ వింతగా చూసింది; తండ్రి బాధ పడుతున్నాడని గ్రహించింది.

ఈ సమయంలో సరోజతల్లి శాంత వచ్చింది. కూడా కారుడ్రైవరు వచ్చాడు. డ్రైవరు ఒక ట్రంకుపెట్టె తీసుకువచ్చాడు. ఫోలు మధ్యకు వచ్చి టేబుల్ మీద ఫ్లవర్ వేస్‌ని తీసి ట్రంకు దానిమీద వుంచి అవతలకి నిష్క్రమించాడు.

శాంత పెట్టెతెరచింది. పెట్టిలో వస్తువులందరికీ ఆశ్చర్యం కలిగించేయి.

సరోజ హఠాత్తుగా 'పెట్టె ఎవరు తీశా'రని గట్టిగా అరిచింది.

సరోజ పదిహేనేళ్ళ తమ్ముడు గోపి 'ఏం! నేను తీశా'నన్నాడు.

'నీకేం పని' అని కోపంగా అడిగింది.

'ఏమి టిదంతా. నాకేం అర్థంకావటం లేదు.' అన్న సౌజన్యారావు ప్రశ్నకు శాంత జవాబిచ్చింది "మీ ముద్దుల కూతురుగారి వస్తువులున్నాయి దాన్లో. దీని నతను పంపించాడు, డ్రైవరు స్టేషన్నుంచి ఇప్పుడే తీసుకొచ్చాడు.'

తన పేరు వినపడగానే, నుంచున్నవాడల్లా బయటికి వెళ్లి కొద్దిసేపట్లో పోస్టుకార్డొకటి తీసుకొచ్చాడు. ఎవరి కివ్వటమా అన్న సందిగ్ధంలో పడ్డాడు. సరోజ లేచింది ఆ కార్డు నందుకుందామని. కాని తండ్రి సరోజ ఆత్రాన్ని గ్రహించి తనే లాక్కున్నాడు డ్రైవరు చేతులోంచి. ఉత్తరం చదవటం మొదలెట్టాడు. మధ్యలో ఆపి తలెత్తి సరోజవైపు తీక్షణంగా చూశాడు.

'ఏమిటీ నాటకం సరూ' అని ఆ కార్డు చదివాడు పైకి.

బి. యే. ఆనర్సులో సీటు వచ్చిందనీ, వెంటనేజీతం చెల్లించాలనీ ఉంది అందులో ఆమెవేపు చూశాడు.

'అవును నాన్నా! నేను ఆయన దగ్గరకు వెళ్లను. కాలేజీలో చేరతా.'

'ఇంకెప్పుడూ వెళ్లవా' అని తల్లి శాంతమ్మ అడిగింది.

'అది కాదమ్మా! నే నలా చేద్దామని ధృవపరచుకున్నాను.'

ఇలా అనగానే శాంతమ్మ కూతురి నురిమి చూసి కళ్లనీళ్లు పెట్టుకుంది. ఆమె నూరుకోమని 'నీ మొగుడితో ఏమైనా పోట్లాడావా' అని సరూ నడిగాడు సౌజన్యారావు.

సరోజ అంతవరకు ఆపుకొన్న దుఃఖమాగింది కాదు.

వాళ్లంతా ఇలా జరుగుతుందనుకో లేదు. ఎంత విషమ పరిస్థితుల్లోనూ కళ్ళనీళ్లు పెట్టుకునే స్వభావంకా దామెది.

రావు కూతురి పరిస్థితిని గమనించి సోఫా చేతిమీద ఆని సరోజ ముఖాన్ని పైకెత్తి జేబు రుమాలుతో కన్నీరు తుడిచాడు.

రకోపం లేకుండా శాంతంగానూ, వాత్సల్యంగానూ మాట్లాడాడు.

'ఫరవా లేదు చెప్పమ్మా! నీ వెందుకు బాధపడుతున్నావో.'

'అలాగే నాన్నా! పిల్లాడు పోయి నప్పటినుంచి...'

అని సరోజ నెమ్మదిగా ప్రారంభించ గానే శాంతమ్మ మధ్యలో అందుకుని.

'పిల్లాడు పోయాడనేనా? నాకూ తొలి చూలు బిడ్డ పోయినప్పుడు గుండె నీరయి పోయింది. కాని నేను మీనాన్నను వది లేశానా?' అని దీర్ఘం తీస్తూ కోపంగా అడిగింది.

'నువ్వు నోరు మూసుకో' అని ఆజ్ఞాపనగా కసిరేడు సౌజన్యారావు.

'అది కాదమ్మా! పిల్లాడు పోయాడని కాదు...'

'మరింకెందుకు'

'అదో పెద్దగాథ'

'నీ వెందుకు చెప్పకూడదు?'

'నే చెపా.'

సరోజ చెప్పటం ప్రారంభించింది.

'నాన్నా! నీకు ఆ నర్సు జ్ఞాపకం ఉండి ఉంటుంది.'

ఈ ప్రశ్న అక్కడివాళ్ళందరికీ వ్యర్థంగా తోచివుండవచ్చు. ఆ నర్సుకీ ఆమె గాథకి ఏమి సంబంధం? కాని వాళ్లందరూ ఆ విషయం ఎత్తలేదు.

'పిల్లాడు పోయాడని ఎంతో దుఃఖంలో వుంటే ధైర్యంచెప్పి ఓదార్చిందా నర్సే నాన్నా.'

ఇక్కడ తల్లికి ఒకమాట అనాల్సిన అవసరం కనిపించింది.

'నేను వచ్చేదాన్నే - కాని ఆ వెధవలు హాస్టలులో వుండటానికి ఒప్పుకుంటేగా.'

'అదికాదమ్మా! ని న్నేమీ అంటంలేదు. నేను ఆ నర్సుగురించి మాట్లాడుతున్నా నంతే.'

'నేనంటే ఎంతో అభిమానంగానూ, ప్రేమగానూ ఉండేది. నా విషయంలో చాలా జాగ్రత్తగా చూసేది. నా బాధ అర్థం చేసుకున్ని తీరుబడి అయినప్పుడల్లా నా దగ్గర కూర్చుని మాట్లాడేది.

'మే మిద్దరం ఆ కొద్ది పరిచయంతోనే చిరకాలంగావున్న అవినాభావసంబంధంలా ఏర్పడిందంటే కారణం నేను చెప్పలేను. మే మిద్దరం ఒకే వయస్సులో వున్న వాళ్ళమే.

'గంటలకొలది అలా మంచంమీద వుండి కదలలేని పరిస్థితుల్లో బాధపడుతూవుంటే, ఆమెగాని నాతో అలా మాట్లాడకపోతే నేను ఏనాడో చనిపోయి వుండేదాన్ని పుట్టెడు దుఃఖాన్ని దిగమింగలేక. ఆమెతో పరిచయం ప్రాణం లేచివచ్చిందనిపించేది మరణావస్థలో వున్న నాకు.

'ఆ పరిచయంలోనే ఆమె గురించి అంతా తెలుసుకున్నా - ఎందు కామె నర్సుగా చేరవలసి వచ్చిందో అంతానూ.

'ఆమె చెప్పినదంతా ఆశ్చర్యం కల్గించింది.

'అదంతా కొద్దిసంవత్సరాలమాట. ఆమె ఆ రోజుల్లో చాలా అందంగా ఉండేది.

ఇప్పుడు కూడా అందంగానే ఉంది. ఆ అందమే ఆమె కనేక కష్టాలకు కారణభూతమయింది.'

సరోజ ఆగింది. ఆమె ఓపిగ్గా, శాంతంగా చెప్పేదంతా ప్రశాంతంగా వింటున్నారు కుతూహలంతో. వాళ్ళకేం అర్థం కావటంలేదు ఆమె మనోభావం కాని ఆమె నిశ్చలతను భంగపరచదలచుకోలేదు. పెదవులు విప్ప లేదు.

ఇదేం తెలియనట్టుగా తన గాధను సాగిస్తోంది.

'ఆమె వుంటున్న వీధిలోనే ఒక యువకుడు ఈమెని ప్రేమించాడు.

'అతను బి. ఏ. చదివేవాట్ట. మంచి రూపవంతుడే.

'వాళ్లిద్దరూ రోజూ సాయంత్రం హిందీ చదివేందుకు ఒకే చోటుకు వెళ్లేవారట. అందువల్లే వారిద్దరూ ఒకర్నొకరు తెలుసుకున్నారు. వాళ్ళిద్దరూ ఒకే వీధిలో ఉంటం మీదట వాళ్ళిద్దరూ కలసి వెళ్లేవారు.

'ఎలాగో ఇద్దరికీ దోస్తీ కుదిరింది. ఆ దోస్తీయే పరస్పర ప్రేమగా రూపొందింది. తనని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాడని నమ్మి ఆ అమ్మాయి హృదయం ఇచ్చింది.

ఆ దోస్తీయే చాలాదూరం పాకింది. తను తల్లిని కాబోతున్నానని తెలుసుకోవడం ఎంతో కాలం పట్టలేదు.

'కొంచెం గాబరాపడింది. ఆ అబ్బాయి దేవుడెదుట ప్రమాణం చేశాట్ట తప్పక పెళ్లి చేసుకుంటానని. అదంతా నిజమనే నమ్మింది. మురిసిపోయింది.

'ఉన్నట్టుండి ఓ రోజున అదృశ్యమయ్యాడు విశాలప్రపంచంలోకి ఆ ప్రబుద్ధుడు. ఆ ఘాతకుడు.'

'నేనలా జరుగుతుందనుకొన్నాను' అన్నాడు సౌజన్యారావు.

సరోజ బరువుగా ఊపిరి తీసుకొని తేరుకొంది.

'ఎక్కడా జాడ లేదు. ఎంత ప్రయత్నించినా.

'ఇంకేం చేయాలి. ఆమె తల్లి దండ్రులకు తెలిస్తే బలవంతాన చస్తారని మథన పడింది.

'వాళ్ళేం అంత ఉన్నవాళ్లు కాదు.

'ఒక రాత్రి ఇల్లు విడిచిపెట్టి బయలుదేరింది తల్లిదండ్రులను బాధపెట్టకుండా ఉండటంకోసం. భవిష్యత్తెలాగా అనుకుంది.'

'అయ్యో! పాపం! ఇలాంటి వాళ్లెంతమందున్నారో ఈ లోకంలో'

'ఆ రోజునుంచీ ఆసుపత్రిలో నర్సుగా జాయినయి బ్రతుకుతోంది. చిన్నప్పటినుంచి కని పెంచిన తల్లిదండ్రులను దుఃఖంలో ముంచి తానీ వ్యర్థ జీవితాన్ని గడపటం ఇదంతా ఎందుకు కలిగింది? ఇదంతా ఆ నీచుడి మూలానే.'

'ఆమె ప్రసవమయిందా' అని అడిగింది తల్లి. తల్లికి తెలుసుకుందామని ఎంతో కుతూహలం, ఆ నర్సుమీద సానుభూతి కలిగింది లాగుంది ఒక్క పెట్టున.

'ఆ మగపిల్లాడ్ని ప్రసవించింది.'

ఇంతవరకూ ఆ నర్సు గాధ ఓపికతో విని, అసలు ముఖ్యమైన గాథ సూటిగా చెప్పకుండా ఏవిటీ శాఖాచంక్రమణం అనుకొని ఇంక అడగలేకుండా ఉండలేకపోయింది కొమాల్ను ఆ ప్రాణం.

'ఏమిటి సరూ! నీ నిర్ణయానికీ దీనికీ ఏం సంబంధం? ఇదంతా అగమ్యగోచరంగానూ, అరణ్యరోదనంగానూ ఉంది.' అని అడిగాడు.

'చెప్తా నాన్నా! నేను చాలా విచారించానామె గాధ విని 'ఎవరా నీచుడు. అతని పేరు చెప్పమన్నాను' ఎంతకీ చెప్పిందికాదు. ఎవరి పాపాన వాళ్లు పోతారని వేదాంత ధోరణిగా.'

'ఆ పిల్లాడ్ని చూశావా' అనడిగింది తల్లి ఆత్రం హెచ్చి.

'నాకు చూద్దామని వుండి ఆసుపత్రికి తీసుకు రమ్మంటే తీసుకొచ్చింది.'

'ఆ పిల్లాడ్ని చూసేప్పటికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. ఆ పిల్లాడి పోలిక ఇప్పటికీ గుర్తే. ఎలా మరచిపోతాను. మరచిపోదామన్నా మరపురాని పోలిక' ఎవరి పోలికో తెలుసా?' తల్లివైపు జవాబుకోసం చూస్తూ.

తల్లి నిశ్శబ్దంగా ఉంది జవాబివ్వలేదు.

'ఎవరిపోలిక?' అని సౌజన్యారావు సరోజని ఆతృతగా ప్రశ్నించాడు.

సరోజ ఊరుకుంది జవాబివ్వకుండా

(47-వ పేజీ చూడండి)



మంత్రివర్గం

# రాజాజీ మంత్రివర్గ ప్రమాణస్వీకారం





ముఖ్యమంత్రి రాజాజీ ప్రమాణ స్వీకార పత్రంపై సంతకం చేస్తున్నారు.

ప్రమాణం స్వీకరించిన మంత్రులలో కొందరు. 1. శ్రీ యన్. శంకరరెడ్డి, 2 శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు, 3. డా॥ యు. కృష్ణారావుగార్లు




4 డా॥ యం వి కృష్ణారావు, 5 శ్రీ యస్. రంగారెడ్డి, 6 శ్రీ కె వెంకటస్వామి నాయుడుగార్లు.

# నేర్పరితనము

శ్రీ రావెళ్ల హనుమంతరావు

త్వరగా రావోయ్. కృష్ణ రావు. త్వరగా ... అతి త్వరగా రమ్మనమని కేకలేసేవారు కొందరు—

అత ఎప్పుడూ అలా ఆలస్యంగానే వస్తాడనేవారు మరికొందరు.

మనలాగా రిక్షాలు - జట్కాలు - గుర్రం బళ్లు - సిటీ బస్సులు ఎక్కి ధనాన్ని వృధాగా ఖర్చు చేయడని ఇంకొందరు.

పోనీ...ఒక సైకలైనా కొనుక్కోడు. అలాగే నెమ్మదిగా ఇంటినుండి - ఆఫీసుకు, ఆఫీసునుండి - ఇంటికి తాబేలులాగ నడుస్తూనే ప్రయాణం జేస్తాడని కొందరు.

తననుగురించి తలకొక రకంగా ఎగతాళిగాను - హేళాకోళంగానూ - వెటకారంగానూ మాట్లాడుతూంటే మీ రెప్పుడూ ఇలాగే అంటూంటారు లెమ్మని సమాధానం చెబుతూ, అదోకరకంగా నవ్వుతూ కృష్ణారావు క్లబ్బులోకి ప్రవేశించాడు.

ఆఫీసులో పనిజేస్తూండగా తోటి గుమాస్తా వచ్చి ఇవ్వాళ సాయంకాలం క్లబ్బులో టీపార్టీ వుంది. త్వరగా పని ముగించుకొని రమ్మనమన్నప్పుడే కృష్ణారావు ఇదంతా ఆలోచించాడు. తాను నడిచి వెళ్ళేసరికి ఎలాగూ ఆలస్యమవుతుంది. అందరూ తప్పనిసరిగా ఎగతాళి చేస్తారు. అలాగని వెళ్ళకుండగా మానుకోవడం మంచిదిగాదు. పోనీ...రిక్షా ఎక్కిగాని - గుర్రంబండి ఎక్కిగాని - సిటీ బస్సు ఎక్కిగాని వెళ్లుదామంటే అందుకూ మనస్సు అంగీకరించదు. వీటిల్లో ఏ దెక్కి వెళ్ళినా రానూపోనూ అర్ధరూపాయి డబ్బు లవుతాయి! అర్ధరూపాయి డబ్బులు ఖర్చుజేసుకొని అక్కడ కెళ్లి వచ్చే దానికంటే ఇక్కడనే కాసిన్ని కాఫీ త్రాగితే సరిపోతుంది. మిగతా డబ్బులతో కూరగాయలు పట్టుకెళ్లితే ఇంటిదగ్గర రెండు రోజులు గడచిపోతాయి! ఇలాంటి ఆలోచనలు అనేకం ఆలోచించుకొని అతను నడకతోనే అక్కడకు చేరాడు. అందరూ ఎగతాళిచేస్తూంటే అది మామూలేనని సమాధానం జెప్పుకున్నాడు.

అప్పటికప్పుడే క్లబ్బులో అనేకమంది సుఖాసీనులై యున్నారు. కృష్ణారావు ప్రవేశించగానే తోటిగుమాస్తా కేకేసి, తనదగ్గరలోనున్న ఖాళీ కుర్చీని చూపించి, ఆ కుర్చీని కృష్ణారావుకోసం తానే వుంచినట్లుగా గర్వంతో తల పైకెత్తి చూశాడు.

సినీమాల్ని గురించి, తారల్ని గురించి పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకోవడం - మధ్య మధ్య నవ్వుకోవడం వగైరా ఉత్సాహాలతో అందరూ సంతోష సముద్రంలో మునిగితేలుతున్నారు. కృష్ణారావు వచ్చి కూర్చోగానే క్లబ్బు సెక్రెటరీగారైన రామారావు అందరూ వచ్చినట్లేనా? యని ప్రశ్నించాడు.

అవును. అందరూ వచ్చినట్లేనని సీనియర్ గుమాస్తా సమాధానం చెప్పగానే రామారావు లోపలికెళ్లి సర్వర్ను హెచ్చరించాడు. వెంటనే వాళ్లు ఉరుకులు-పరుగులతో కార్యక్రమం ప్రారంభించారు.

మంచినీళ్ల గ్లాసులు - తరువాత పంచదార లడ్డూలు - చక్రకేళీలు - తరువాత మైసూరుపాకం - ఆ తరువాత కారంబూంది ఒకదాని తరువాత వేరొకదాన్ని దెచ్చి అక్కడ కూర్చున్న వారిముందు పెట్టేశారు. హాజరైన పెద్దలు కొస్త కొస్త ఫలహారమే నోట్లో వేసుకొంటూ సంభాషణ ప్రారంభించారు.

"కారులు స్టాండింగ్ దగ్గర పని జేయించిన కంట్రాక్టుదారు మొన్న యల్. యఫ్. ఓవర్సీలు గారికి అయిదు వందలు రూపాయలు ముట్టజెప్పారు. ఆ ఉల్లాసంతో ఓవర్సీలుగారివ్వాళ అందరికీ టపార్టీ చేస్తున్నారు."

విషయం అందరకూ తెలిసిపోయింది. ఫలహారాలు తినడం - కాఫీ త్రాగడం - ఖిల్లీలు నములడం - సిగిరెట్లు వెలిగించడం - పూర్తిఅయిన తరువాత అక్కడ కూర్చున్న వారిలో కొందరు తమ తమ ప్రభావమీ విధంగా చెప్పడం ప్రారంభించారు.

"ఒకానొక గ్రామంనుండి నా దగ్గరకు నిరుడు కొంతమంది రైతులు వచ్చారు. తమ గ్రామానికి ప్రత్యేకంగా పంటకాలువ గావాలని పిటీషను పెట్టుకున్నారు. ఆ కాలువ అవుసరం అవునో, కాదో తెలుసుకొని, అయితే ఎంత ఖర్చుతో పని పూర్తి అవుతుందో లెక్క వేసి, ఆ ఖర్చులో రైతు లెంత ఇవ్వగలరో అడిగి పూర్తిరిపోర్టు పంపించమనే రిమార్కుతో కాగితాలు తిరిగివచ్చాయి. అందుచేత రైతుల కనుకూలంగా పనిజేసి, అంతా గవర్నమెంటుఖర్చుతోనే తూములు వగైరా పడేట్లు యేర్పాటుజేసి, ఆ కాగితాలమీద పై ఆఫీసరుగారితో సంతకం జేయించి పని పూర్తిచేసినందులకు ఆ గ్రామరైతులు నాలుగువందల రూపాయలిచ్చారు. ఆ డబ్బుతో "ర్యాలీ" సైకిలు కొన్నాను. తిరిగి అలాంటి అవకాశం ఏమన్నా దొరికితే యీసారి రేడియో కొనాలని వున్నది."

పి-డబ్ల్యు-డి- ఆఫీసులో పనిజేసే పెద్ద గుమాస్తా తన ప్రభావం చెప్పుకోవడాన్ని ముగించగానే తహశీల్దారు ఆఫీసు గుమాస్తా తన ప్రభావాన్ని చెప్పు[illegible] ప్రారంభించాడు.

"నాలుగ్రోజుల క్రితం ఒక పెద్దమనిషి నా దగ్గరకు వచ్చాడు. అతనికున్న పంచదార కోటా పెంచమని - కిరోసిన్ కోటా గూడా తనకే ఇప్పించమని పిటీషన్లు వ్రాయించుకొచ్చి తహశీలుదారుగారితో పని చేయించమని బ్రతిమలాడాడు. పది రూపాయలు చేతిలో పెట్టి పని పూర్తి అయిన తరువాత మరొక పదిహేను రూపాయలు తీస్తాను లెమ్మనమన్నాడు. ఇలాంటివి రెండుమూడు పద్దులువస్తే! ఈ సంవత్సరం నాకూ - భార్యకూ - బిడ్డలకు బట్టలు కొనేపని తీరిపోతుంది."

ఈయన ప్రభావం చెప్పుకోవడం పూర్తి కాగానే జిల్లా సప్లయిఆఫీసరుగారి గుమాస్తా అందుకున్నాడు.

"మొన్న ధనలక్ష్మిమిల్లువాళ్లు వేయి బస్తాల బియ్యం ఎగుమతికి పర్మిషన్ ఇప్పించవలసిందిగా పిటీషన్ బెట్టుకొని, జిల్లాసప్లయి ఆఫీసరుగారితో పని పూర్తి జేయించుకు నేందుకు వచ్చారు. వారిదగ్గర రెండువందల పాతిక రూపాయలు దీసుకొని చిల్లరమాత్రం నా జేబులో వేసుకొని

మిగతా రెండువందలు ఆఫీసరుగారి కిచ్చి పని పూర్తిజేయించాను. ఈ విధంగా నాల్గు - అయిదు రోజుల కొకసారి పదో! పాతికో! కళ్ళజూస్తూనే వుంటాను."

ఈ విధంగా పి-డబ్ల్యు-డి-గుమాస్తాలు, డి-యస్-ఓ గుమాస్తాలు, రెవెన్యూ ఆఫీసు గుమాస్తాలు, యల్-యఫ్-ఓ గుమాస్తాలు, వెటరనరీ శాఖ, ఎగ్రికల్చరల్ శాఖలవాళ్లంతా తమతమ ప్రభావాల్ని వర్ణించుకొంటూ ఇతరుల నోరూరిపోయేట్లు కబుర్లు చెబుతూంటే కృష్ణారావుకు మరొక లోకంలోని సంగతులు తెలుసుకొంటూన్నట్లుగా వుంది. సినీమాబొమ్మ లేమైనా కదలిపోయినట్లుగా వుంది. రాత్రి తొమ్మిది గంటలు కాగానే రేడియోనుండి ఇంగ్లీషు వార్తలు విని ఎవ్వరిత్రోవను వారు వెళ్లిపోయారు.

కృష్ణారావు నడుస్తూ జరిగిన సంగతిని, విన్న మాటల్ని నెమరుకు దెచ్చుకొంటూ - విమర్శించుకొంటూన్నాడు.

లంచాలు పుచ్చుకోవడం న్యాయమేనా? లంచాలు ఇచ్చేవాళ్లు ఎందుకిస్తారు? వాళ్ళేదో తప్పుజేసి, ప్రజల సొమ్ము దోచుకొని, ఆ దోపిడీసొమ్మునుండే గదా వీళ్ళకు లంచా లిచ్చేది? ఈ విధంగా లంచాలు పుచ్చుకోవడం పాపం గాదా? ప్రజలకు ద్రోహం చేయడం గాదా?

గత సంవత్సరం ఏమి జరిగింది? కృష్ణానది వద్దున రాయి "రివెట్ మెంటు" చేయించిన కంట్రాక్టుదారుడు పై ఆఫీసరుకు - గుమాస్తాలకు రెండువేల రూపాయలు లంచం ఇచ్చాడు. అంటే! ఆయనకే పది వేల రూపాయలో మిగిలివుంటాయి. దీనికి ఫలితంగా జరిగిం దేమిటి? కృష్ణానదికి తొలకరినీరు రాగానే ఆ రాయి "రివెట్ మెంటు" అంతా జారిపోయింది. రాయి కృష్ణానదిపాలైంది. కృష్ణ ప్రవాహం ఒడ్డుల తెగ్గోసి అక్కడ నివసించే ప్రజలకు కష్టాల్ని - నష్టాల్ని గల్గించింది.

ఇదేగా లంచాలు పుచ్చుకోవడం? గవర్నమెంటుకు ఆర్థికంగా నష్టం. పనుల్లో లోత్తడం. ప్రజల కష్టాలు మామూలు. అడిగినంత లంచమిస్తే పని పూర్తిగావడం. లేకుంటే "ఎక్కడున్నావు గొంగళీ అంటే - వేసినచోటనే వున్నా నన్నట్లు" ఎక్కడ కాగితాలు అక్కడనే వుండిపోవడం. "విదేశప్రభుత్వం వెళ్లిపోయి కాంగ్రెసు అధికారంలోకి వచ్చినతరువాత యీ లంచాలగొడవ మరీ ఎక్కువైపోయింది. గాంధీ...గాంధీ...అంటూ గాంధీగారి పేరు జెప్పుకునేవాళ్ళే గాని ఆయన చెప్పినదాన్ని అనుసరించేవాళ్లు ఎక్కడా కనుపించరు"

లంచం పుచ్చుకోవడ మెందుకు? సైకిల్ కొనడ మెందుకు? ఇంటిదగ్గరనుండి ఆఫీసుకు - ఆఫీసునుండి క్లబ్బుకు - క్లబ్బునుండి సినీమాహాలుకు - అక్కడనుండి ఇంకెక్కడకో తిరగట మెందుకు? ఇదంతా నవనాగరికతయేనా? గాంధీగారు బ్రతికుంటే ఇలాంటివాటిని హర్షించుతారా?

తన కున్నటువంటి ఇలాంటి సందేహాలన్నింటినీ స్నేహితులతో చెప్పి చర్చించితే కొంతమంది నీవు గాంధీభక్తుడవై పోతూన్నావని నవ్వారు. మరికొందరు చూస్తూండగానే కృష్ణారావు పెద్ద కమ్యూనిష్టుగా మారిపోయాడని ఎగతాళి చేశారు. ఆలోచనా సముద్రంలో పడి నడుస్తూన్న కృష్ణారావుకు యీ సంగతి గుర్తుకొచ్చేసరికి పెద్ద నవ్వు వచ్చింది.

తానెలా కమ్యూనిస్టు అవుతాడు? కమ్యూనిస్టుల దృష్టిలో దేవుడు లేడు. తాను నిత్యం రెండుపూటలా దేవుణ్ణి పూజించుతాడు. కమ్యూనిష్టులు కుల-మత-జాతి-లింగ భేదాలు లేవంటారు. తనకు హిందూమతం గొప్పదని వుంది. తనకూ కమ్యూనిష్టులకూ మధ్య ఇంత తీవ్ర భేదాభిప్రాయాలున్నప్పుడు తానెలా కమ్యూనిష్టు అవుతాడు? ఇంతకంటే కమ్యూనిష్టులకు విరోధినంటే బాగుంటుంది అయినా! కమ్యూనిష్టులకూ - నాకూ విరోధంమాత్రం ఏముంది?

మొన్న శనివారంరోజున కమ్యూనిస్టు నాయకుని క్లబ్బుకి ఆహ్వానించినప్పుడు ఎంత బాగా మాట్లాడాడు.

లంచాలు పుచ్చుకోగూడ దన్నాడు. తాము అధికారంలోకి వచ్చిననాడు లంచాలు పుచ్చుకునే అవకాశం, లంచాలనిచ్చే అవకాశం లేకుండగా జేస్తామన్నాడు. యన్-జీ-వోల, మధ్యతరగతి గుమాస్తాల, చిన్నచిన్న ఉద్యోగస్తుల జీతాలు పెంచి వాళ్ళ దృష్టినీ లంచాలవైపుకు వెళ్లకుండగా జేస్తామన్నాడు. ఇది జరిగితే ఎంత బాగుంటుంది? అనేక విధాలుగా ఆలోచించుకొంటూ కృష్ణారావు నెమ్మదిగా ఇంటికి జేరుకున్నాడు.

## 2

తలుపు . తలుపు...

పుష్పా...తలుపుదియ్...

అయిదారు కేకలు వేసినతరువాత పుష్పావతి వచ్చి తలుపుతీస్తూనే ఇంత ప్రొద్దుపోయేవరకున్నా రేమని ప్రశ్నించింది.

"ఇవ్వాళ మా స్నేహితు డొకడు అందరికీ క్లబ్బులో టీపార్టీ ఇస్తూ రమ్మనమంటే వెళ్ళేను. అక్కడకు వెళ్లినతరువాత కబుర్లతో ఆలస్యమైపోయింది."

"అవును. మీకేంలెండి. క్లబ్బులు-టీపార్టీలు - సినీమాలు - కబుర్లు. ప్రొద్దున్నే వెళ్లితారు ఇప్పుడు వస్తారు. ఈ మధ్యలో నే మెన్నిబాధలు పడుతూన్నామో! ఎన్ని మాటలు పడుతూన్నామో! మా కష్ట



తెలుస్తుంది?" చిరాకుగానూ, కోపంగానూ పుష్పావతి యీ మాట లనేసరికి—

"నీవుపడే బాధ లేమిటి? మాట లేమిటని" కృష్ణారావు ప్రశ్నించుతూనే అంగవస్త్రం కట్టుకొని స్నానానికి బయలు దేరాడు.

"ఇంటి యజమాని అద్దెకోసం నాల్గుసార్లు కబురు పంపించాడు. కోమటి దుకాణం షాహుకారు ఎన్నిసార్లు వచ్చాడో! లెఖ్ఖే లేదు. ఇక పాలుపోసే వాళ్ళ మాట—మజ్జిగపోసేవాళ్ళమాట సరే సరి. పిల్లలకు నీళ్ళుకాని పోద్దామంటే కట్టెపుల్లలు అయిపోయినాయి! ఇవన్నీ బాధలు కాదు కాబోలు?"

భార్య చిరాకుగానూ, వ్యంగ్యంగానూ పైమాట లనేసరికి కృష్ణారావు త్రుళ్ళిపడి తప్పుజేసినవాడు సమర్థించుకో జూసినట్లుగా "జీతం రాగానే బాకీలన్నీ చెల్లుబెట్టివేద్దాము లె"మ్మన మని సమాధానం చెప్పాడు.

ఈ సమాధానం పుష్పావతికి ఏ విధంగానూ సంతృప్తిని గల్గించలేదు. అప్పులు జేయడం - సర్దుకోవడం. ఎగరడం - క్రింద పడడం. ఇదే వరుస. ఎప్పుడూ ఇలాగే జరుగుతూంటే ముందు ముందు సంసారం ఖర్చులు పెరిగినతరువాత సంసార యాత్రను గడిపే దెలాగో! నా కర్థం గావటం లేదు. ఇతరులను జూస్తే ఆశ్చర్యం వేస్తుంది.



కృష్ణారావు భోంచేస్తున్నాడు. పుష్పావతి అతనికి కావలసిన వేమిటో వడ్డించుతూనే తనలో తాను గొణుక్కుంటూంది.

"తోటివాళ్ల సంసారాలు ఎంతో సంతోషంగా గడుస్తూంటాయి. పెద్ద పెద్ద డాబాల్లోనూ, మేడల్లోనూ కాపురాలు. పాచిపనులు చేయడానికి - అంట్లు తోమడానికి నౌఖర్లు. పండగలకొందలు ఖరీదుచేసే చీరెలు. వంటినిండా బంగారం నగలు. రెండు రోజులకు మూడు రోజులకు సినీమాలు. వాళ్ళ జీవితా లెంతో హాయిగానూ, సౌఖ్యంగానూ గడచిపోతూంటాయి. ఇక మన గతి ఎప్పుడూ ఇంతే."

గుక్క త్రిప్పుకోకుండగానూ, సమాధానికి అవకాశం ఇవ్వకుండగానూ భార్య అంటూన్న మాటలు వినేసరికి కృష్ణారావుకు తామసం వచ్చింది. కొంతు పెద్దది జేసి ఇలా అన్నాడు.

"వాళ్ళకుమల్లే లంచాలు పుచ్చుకొంటే మనంగూడా అలాగే జీవించవచ్చును ఇంతేగాదు. ఇంతకంటే పైలా పచ్చీసుగా కూడా జీవించవచ్చును."

ఈ మాటలు వినేసరికి పుష్పావతికి నవ్వు వచ్చింది వెంటనే కోపంగూడా వచ్చింది. "ఇలాగే గడపండి జీతాలు పెరుగవు. మొన్నటివరకు జాతీయప్రభుత్వం వచ్చిందిగదా! కుటుంబ అవుసరాల్ని బట్టి జీతాల్ని పెంచుతుందని కబుర్లు చెప్పారు. ఆ ఆశలన్నీ నిరాశలయ్యాయి. జీతాలు పెరిగే ఆశ లేదు. లంచాలు పుచ్చుకోరు. ఖర్చులు మాత్రం పెరుగుతూన్నాయి. ముందు ముందు జీవించే దెలాగో చూస్తాను."

ఆ రాత్రి కృష్ణారావుకు నిద్దురలో ఇవే కలవరింత "ఇదిగో... పుష్పా... నీమీదఒట్టేసుక మరీ చెబుతూన్నాను. నేను కూడా వీలునుపట్టి లంచాలు దీసుకుంటాను. ఇక నుండి మనం కూడా అలాంటి జీవిత హాయినే అనుభవించుదాం... ఇది నిజం... నమ్ము... పుష్పా... నమ్ము..."

## 3

"నమస్కారం. కృష్ణారావుగారూ నమస్కారం."

"ఏవూరండి?"

"మాది వెంకటాపురం."

"ఏమి పనుండి వచ్చారు?"

"సబ్ డివిజనల్ ఆఫీసరుగా రున్నారా?"

"లేరు... వూరు వెళ్ళారు."

"ఎప్పుడు వస్తారండి?"

"రాత్రికే రావచ్చును."

"వారితో పనివుండి వచ్చామండి."

"పనేమిటో చెబుతారా?"

"ఆ... ఆ... చెబుతాం. తమకు గాక మరెవ్వరికి చెబుతామండి. మా చెరుకు తోటలకు నీళ్ళుగావలసివచ్చినాయి. ఓవర్సీరుగారిదగ్గర కెళ్ళితే సబ్ డివిజనల్ ఆఫీసరుగారినడిగి ఆర్డరు తెచ్చుకోమన్నారు అందుకోసం వచ్చాము."

"కృష్ణలోనే నీరు తక్కువగావున్నది గనుక మీపని పూర్తిఅయ్యేవరకు నమ్మకం వుండదు."

"నిరుడు సంవత్సరంగూడా ఇలాగే అయింది లెండి. లేవు లేవంటూనే ఎక్కా-తక్కాగా వదిలేశారు." అని రైతులు అనేసరికి —

"అయితే ఆఫీసరుగారి ఇష్టం - మీ అదృష్టం" అని చెప్పి ఇందులో తన కేమీ బాధ్యత లేనట్లుగా తప్పుకోవా లనుకున్నాడు కృష్ణారావు.

కాని... ఆ రైతులుమాత్రం అతన్ని వదలి

పెట్టలేదు. "ఈపని పూర్తిచేయవలసిన భారము తమపైనగూడా వుంది. తమరు చేయదలచుకొంటే మా పని పూర్తి అవుతుంది. తమరు చేయగలరన్నీ, చేస్తారని ఆశతోనే వచ్చాము."

అని రైతులనగానే కృష్ణారావు చేతులు అడ్డంగా తిప్పుతూ "లాభంలేదు బాబులారా! లాభంలేదు. ఈ పని నా వల్లగాదని" చెప్పాడు.

అతన్ని రైతులు అంతటితో వదలిపెట్టలేదు. వెంటబడి బ్రతిమలాడారు. చేతులు పట్టుకొని చేతులు గావివి కాళ్లనుకోమన్నారు. అప్పటికీ కృష్ణారావు అంగీకారాన్ని కనుపించనీయకపోయేసరికి వూరకనే చేయొద్దులెండి. మా శక్తినిబట్టి "తులమో - ఫలమో ఇస్తా"మన్నారు.

ఈ మాట వినేసరికి కృష్ణారావు మనస్సు సందిగ్ధావస్థలో పడింది. లంచం దీసుకోవాలా? అవుసరం లేదా? తీసుకోవాలనుకుంటే ఇదే మంచి అవకాశం. లంచం వద్దు. మంచం వద్దు. సబ్ డివిజనల్ ఆఫీసరుగారు వచ్చిన తరువాత కలుసుకొని మాట్లాడమని చెబుదామనుకున్నాడు.

మళ్ళీ వెంటనే ఇల్లూ - పిల్లలూ - అద్దెవాని కేకలూ - భార్యా గొణుగుడూ - తినకు నిద్రల్లో వచ్చిన కలవాట్లూ అన్నీ గుర్తుకొచ్చాయి.

కృష్ణారావు ఆలోచనలో పడ్డం కనిపెట్టిన రైతులు మరొకసారి హెచ్చరించుతూ మాట్లాడారు "వచ్చిన సదవకాశాన్ని వృథాజేసుకోకండి కావలసిన దేదో తీసుకొని మా పని పూర్తి జేయండి ఇది మాకూ - మీకూ గూడా బాగుంటుంది. చెప్పండి. ఎంత ఇవ్వమంటారో? అడగండి."

కృష్ణారావు దొంగతనం జేసేవాడివలె ఆలోచించి, నాలుగైదుసార్లు క్రిందకూ, పైకీ జూసి...సరే...వందరూపాయ లివ్వమన్నాడు.

ఇది రైతులనుకొనివచ్చిన మొత్తంలో సగం మాత్రమే. అయినా లాంఛనప్రకారం బేరం చేసి ఎనభైఅయిదు రూపాయలు ఇచ్చేశారు. డబ్బు చేతిలోకి రాగానే కృష్ణారావు తనను తాను నమ్మలేకపోయాడు. వ్యాపారం పంటలు వచ్చిన తరువాత - దొంగవ్యాపారం పెరిగిన తరువాత లంచాలు ఇవ్వడం - పుచ్చుకోవడం ఎంత తేలిక సమస్యగా తయారయిందో తలపుకు దెచ్చుకొని ఆశ్చర్యపడ్డాడు.

వెంకటాపురం గ్రామానికి చెందిన వూర చెరువులు రెండింటిలోనూ నీరు తక్కువగా అనగా చెరువులు సగానికి మాత్రమే వున్నాయని, చెరువుల్లో నీరు తక్కువగా వుండటంచేత ప్రజలు తీవ్రంగా భయాందోళనలు జెందుతున్నారని, ఇప్పుడు చెరువులనిండా నీరు పడకపోయినచో ముందు ముందు మండు వేసవికాలంలో ప్రజలూ - పశువులు త్రాగేందుకు నీరు లేక మలమలమాడి చావవలసివస్తుందని, అధికారులు దయయుంచి వెంకటాపురం చెరులకు నీరు సప్లయిజేయించాలని రైతులచేత మహజరు వ్రాయించి - ఆ మహజరుమీద అక్కడకు వచ్చినవారి సంతకాలు, రాని వారి సంతకాలు, మరికొన్ని వేలిముద్రలు వేయించి, క్రింది అధికార్లు ఇది నిజమేనని ధృవపరచినట్లుగా మరొక కాగితం వ్రాసి దానిపై ఓవర్సీర్ సంతకం పెట్టినట్లుగా సంతకం జేసి ఒక కాగితాన్ని తయారుజేశారు.

సబ్ డివిజనల్ ఆఫీసరుగారు రాగానే వారితో చెప్పి, కాగితాలు చూపించి, నమ్మించి పని పూర్తిచేయించుకోవచ్చునని ప్లాను తయారుజేశారు. సంతకాలు వగైరాలన్నీ పూర్తిఅయిన తరువాత రైతులు వెళ్లిపోయారు. వెళ్లిపోతూ త్వరలోనే నీరు వదిలేట్లు చేయమని చెప్పారు. సాయంకాలం అయదు గంటలైంది. ఇంటికి వెళ్లిపోవాలనే ఉద్దేశ్యంతో కృష్ణారావు కాగితాలన్నింటినీ సర్దుకొంటున్నాడు.

ఇంతలోకే సబ్ డివిజనల్ ఆఫీసరుగారు - ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరుగారూ ఇద్దరూ ఆఫీసులోకి వచ్చారు. డ్రాయరుపైనే వున్నటువంటి సంతకాల మహజరును జూశారు. దీన్ని జూచి ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరుగారు మండిపడ్డారు. ఆ గ్రామానికి సంబంధించిన పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగారు వారంరోజుల క్రితమే చెరువులు నిండా నీరుపడినట్లు వ్రాసి పంపించిన కాగితాన్ని గుర్తుకుదెచ్చి ఆ చెరువుకు నీరు వదలవద్దని చెప్పి వెళ్ళిపోయారు.

వారిని సాగనంపిన తరువాత సబ్ డివిజనల్ ఆఫీసరుగారు కృష్ణారావును పిలచి జరిగిన సంగతి చెప్పమన్నారు. కాసేపటివరకు చెప్పకపోయేసరికి దీనిమీదనున్న సంతకం ఓవర్సీలుగారిది అవునో! కాదో! తెలుసుకుంటానని బెదరించాడు. ఈ మాట అనేసరికి కృష్ణారావు కాళ్లూ - చేతులూ వణికాయి. నిజం చెప్పకపోతే ప్రమాదమని వున్నదున్నట్లు చెప్పేశాడు. రైతులిచ్చిన దానిలో ఎనభైరూపాయలను సబ్ డివిజనల్ ఆఫీసరుగారు కాజేసి, అందరు వినేట్లుగా కృష్ణారావును మందలించసాగారు.

ఇది తెలుసుకున్న తోటి గుమాస్తాలు ముక్కుమీద వేలేసుకున్నారు. ఏ మనిషి ఏపని చేయదలచుకున్నా అది మంచిదైనా చెడ్డదైనా, ఏదైనా సరే నేర్పరితనంతో చేసినప్పుడే చలామణి అవుతుందని బహిరంగంగానే చెప్పుకోప్రారంభించారు. ★

# భాగ్యరేఖ

(గతసంచిక తరువాయి)

ఆ సమయంలో సత్యాగ్రహం మంచి ముమ్మరంగా సాగుతూఉంది. కనిపించిన వారిని జెయిలులో పెట్టూఉన్నారు. టెలిగ్రాఫ్ తీగలు తెంపిన వాళ్ళను, తిట్టు సత్యాగ్రహం చేసేవాళ్ళను జెయిలులో పెట్టున్నారు. నామట్టుకు నాకు బయట బాధలు పడేకంటే జెయిలులోకి వెళ్తే నయం అనిపించింది. ఒక చిన్న వీధిలో ఉన్న పోస్టాఫీసు బోర్డు కిరసనాయిలు పెట్టి తగలపెట్టాను. పోలీసువాళ్లు వచ్చి నన్ను కొట్టి జెయిలుకు తీసుకుపోయారు. నేనుకూడా ఒక స్వతంత్ర వీరుణ్ణి అయ్యానన్న గర్వం కలిగింది. జెయిలులో నేనున్నది పదిరోజులు మాత్రమే. బయట జీవితంకంటె, జెయిలులో జీవనం ఎన్నోరెట్లు నాకు బాగుందనిపించింది. కాని ఇటువంటి నిష్ప్రయోజకుడికి

## శ్రీ సత్యనారాయణ శ్రీవాత్సవ

అంత గౌరవం యివ్వడం ఎందుకని ఆ జెయిలుఅధికారులకి కూడా తోచిందేమో! పదిరోజుల తర్వాత మేజస్ట్రేటు కోర్టులో విచారణ జరిగింది. నేను అంతవరకు అనుభవించిన శిక్ష చాలునని వదలివేశారు. అయినప్పటికీ నాకు జెయిలుకి పోవాలన్న కోరిక చావలేదు. రైలుబండి నడుస్తూఉంటే మధ్య త్రోవలో 'అలారం చెయిన్' లాగి బండి ఆపివేశాను. ఏమిటి అంటే బండిలో జనాన్ని క్రిక్కిరిసి కూర్చోబెట్టినందుకు నేను సత్యాగ్రహం అన్నాను. నన్ను ప్రక్కస్టేషనులో దింపివేసి అక్కడఉన్న మిలిటరీ పోలీసువాళ్లు లారీలతో కుళ్లుపోట్లు పొడిచి వదలివేశారు. తిరిగి నా జీవితం—సత్రం భోజనం మఠం నిద్రలోకి మారింది.

ఒక ధర్మశాలలో ఎవరో పెద్ద సాహుకారు సంతర్పణ చేస్తున్నాడంటే భోజనానికి వెళ్లాను. నాతోపాటు కొందరు 'సాధువులు' కూడా వచ్చారు వాళ్ళతో భోజనాలు పూర్తిచేసి—ఎవరు దారిని వాళ్లు వెళ్ళిపోగా ఆ ధర్మశాలలోనే ఒక గది ముందు పడక వేశాను. నా దగ్గరగా ఒక సాధువు వచ్చి నా పుట్టుపూర్వోత్తరాలు విచారించాడు. భాయి, అంటే భాయి అనుకున్నాం. ఈ బిచ్చగాని జీవితంలో ఉచ్చం నీచం అనే భేదాలుపోతాయి అందరమూ ఒకటే అన్నపూర్ణమ్మ బిడ్డలం. ఆస్తిలేదు; పాస్తి లేదు. గొప్పతనం చూపించి గర్వించ తగ్గ విశేషం ఏమీ లేదు. అంతా ఒకటే. నాతోడి సాధువును—అడిగాను. ఇంతేనా నా బ్రతుకు? ముందుముందు ఏమైనా బాగుపడే సూచన లున్నాయా' అని. అతను ఆప్యాయంగా చూచి—నాయనా! అధైర్యపడకు. అంతా ఆ పరమేశ్వరుడి లీల సృష్టించినవాడు బ్రతికించకపోడు. రాతిలో కప్పకు సైతం ఆ పరమాత్ముడు ఏదో ఆధారం చూపిస్తాడు. కాని మానవుడు తుచ్ఛమైన తోడిమానవుల్ని ఆశ్రయించి వాళ్ళ కరుణాకటాక్షాలకోసం అంతగా ప్రాకులాడతాడు కాని మానవాతీతుడు మహేంద్రమూర్తి అయిన పరమాత్ముడిమీద విశ్వాసం నిలుపుకోలేకపోతున్నాడు" అని వేదాంతం ఉపదేశించాడు. అపుడు నాకు చాల ఉడుకుమోతుతనం కలిగింది.

"పరమేశ్వరుడు ఉన్నాడా? ఉంటే ఎందుకు ఇన్ని బాధలు? నేనేం నేరం చేశానని నన్ను ఇంతగా వంచించి హింసపెట్టున్నాడు. ఏమో గురూ! నాకు అతడు లేడనే అనిపిస్తుంది."

"మంచిదే నాయనా! నీలో నాస్తికత కల్గడం, అంటే నీలో నిష్కపట భావం ప్రవేశించిందన్నమాట. లోకంలో భక్తి నటించేవాళ్ళు అందరూ భగవత్ ప్రసాదం పొందలేరు. ఈయాడంబరాలతో ఆలయాలకి వెళ్ళి భజనలుచేసి, భక్తులమని చెప్పుకొనే వాళ్లు నిజంగా ఆరాధన చెయ్యడం లేదు. ఏవో క్షుద్ర వాంఛలు కోరి వాటిని తీర్చవలసిందని భగవంతుడితో చిల్లర బేరాలు చేస్తున్నారు. అంటే, ఏది చేసినా దానికి ప్రత్యుపకారం కోరే పరమలోభిస్వభావం భగవంతుడికి కూడా ఆపాదించి సంతోషిస్తూ ఉన్నారు. వాళ్లకి కలిగిన భోగభాగ్యాలు తమ ప్రయోజకత్వంవల్ల యీ భక్తిశ్రద్ధలవల్ల వచ్చాయని భ్రాంతి పడుతున్నారు.

భగవంతుడు వాళ్లు ఊహించినంత అల్పుడు కాడు. వీటిని అన్నింటినీ మించిన అతీతమూర్తి —సర్వాంతర్యామి— నీలో, నాలో, చీమలో, సింహంలో అన్నింట నిండియున్నవాడు, అందుచేత నేతనయందు

అఖిల భూతములయందు ఒక భంగి చూచే వారిలో భగవంతుడు ప్రసన్నుడు అవుతాడు. నిష్కాపట్యం—నిజాయితీ ఎక్కడ ఉంటే అక్కడ పరమాత్ముడుంటాడు"

"లేదు స్వామీ! భాగ్యవంతుల చేతిలో భగవంతుడుంటాడు అన్న వాక్యం యీ ప్రస్తుత పరిస్థితిలో పరమ సత్యం"

'నీ బ్రతుకు నిస్సారం అలాగ అనిపిస్తుంది కాని నిజంగా భగవంతుడు-ఆత్మారాముడు ఆకలికడుపులలో ఆక్రోశిస్తున్నాడు. పేదల ఆక్రందనాలలో ప్రతిధ్వనిస్తున్నాడు. నిరాశాజీవుల నిస్పృహలో నిట్టూర్పు విడుస్తున్నాడు. లేదు లేదు అని నీవంటివాళ్ళు చెప్పే నిష్ఠుర వాక్యాలలో కూడా నిండు మనస్సుతో చిరునవ్వు నవ్వుతున్నాడు.'

'మీరు చెప్పింది నిజమే-కాని యీ నిర్భాగ్య జీవనం ఇంతేనా? ఎప్పటికైనా వెలుగు కనిపిస్తుందా? చూడండి నా భాగ్యరేఖ ఎలాగుందో' అని చెయ్యి అందించాను. ఆయన పెద్ద నవ్వు నవ్వి 'వెర్రివాడా? కాలం ఎల్లప్పుడూ ఒకేవిధంగా గడుస్తుందా? కొంతకాలం చీకటి. కొంతకాలం వెన్నెల. మిట్టపల్లాలు. అన్నీ ఓరిమితో దాటుకొని పోతూ ఉండాలి నీకు కావలసింది ఓర్పు-క్షమ—దానితో పాటు విశ్రాంతి.'

'నాకు కావలసింది విశ్రాంతి కాదు శ్రమే. నేనెలాంటి పనులయినా చెయ్యడానికి సిద్ధమే. పనిమాత్రం దొరకడం లేదు.'

'విశ్రాంతి అంటే. పనిలేకపోవడం కాదు. అనేక కష్టదుఃఖాలతో అలసి శ్రమపడిన నీ యాత్మకు విశ్రాంతి కావాలంటున్నాను. దానికి తగిన ఆశ్రయం కావాలి. ఋషీకేశంలో జ్ఞానానందస్వామి ఉన్నారు. వారి ఆశ్రమంలో ప్రవేశించు. నీకు విశ్రాంతీ, ఆత్మకు తగిన శాంతీ లభిస్తుంది' అని చెప్పి ఆ సాధువు తనత్రోవను తాను వెళ్ళిపోయాడు. నాకు మళ్ళీ కొత్త ధైర్యం వచ్చింది. చివరికి యీ మార్గంలో కూడా ప్రవేశించి చూడాలని తోచింది బయలుదేరి ఋషీకేశం వెళ్లాను. పదిరోజుల ప్రయాణం—భయంకర కష్టాలు పడ్డాను. రాబోయే భాగ్యంముందు—ఆ కష్టాలన్నీ అవలీలగా దాటి చివరికి ఆ స్వామి ఆశ్రమం ప్రవేశించాను. నన్ను పలుకరించినవారే లేకపోయారు ఆ ఆశ్రమంలో. ఉన్నానో లేదో గమనించిన వాళ్లు లేకపోయారు. తిండికూడా పెట్టినవాళ్లు దొరకలేదు. ప్రాణం విసుకెత్తి ప్రక్కనే ఉన్న ఒక ధర్మశాలకి వచ్చిన యాత్రీకుల వద్ద ఆశ్రయించి కడుపుమంట చల్లార్చుకున్నాను. ఆశ్రమం పెద్ద యెత్తైన కొండమీద ఉంది. అక్కడనించి క్రిందుగా ధర్మశాల ఉంది. ధర్మశాలకు చేరువగానే ఒక చిన్న మంటపం, దేవాలయం ఆనుకొని వున్నాయి. ఆ మంటపం సోపానాలు దిగి వస్తే-చాలా దిగువగా గంగాభవాని ప్రచండవేగంతో పరుగెత్తుతూ ప్రశాంత కలకల గానం చేస్తూ ఉంది.

ఆశ్రమంలో నాకు చోటు ఎలాగా లేదని ఆ మంటపంలో విడిది చేశాను. స్వచ్ఛమైన ఆ గంగాప్రవాహంలో స్నానం - ఆ మంటపంలో ఉనికి; ఏ యాత్రీకులయినా ఏమైనాయిస్తే అదే నా జీవనం నిలిపేది. ఇలాగ మరొకవారం గడిచిపోయింది. ఈ వారంలోను ఒక స్వామిజీ మూడుసారులు గంగానదికి వచ్చి శిష్యసమేతంగా స్నానంచేసి వెళ్లారు. ప్రక్కవాళ్ళను విచారిస్తే వారే జ్ఞానానంద స్వాములు అని తెలిసింది.

ఒకనాటి సంధ్యాసమయం. అస్తమిస్తూ ఉన్న సూర్యబింబం - గంగానదిలో బంగారు కిరణాలతో స్వర్ణవాహినిలాగ కనిపిస్తోంది. ఆ సంధ్యవేళ చుట్టూఉన్న నిస్తబ్ధప్రకృతి అంతా కొత్త తేజస్సుతో తళతళ మెరసిపోతూ ఉంది. కొత్త శోభ గోచరిస్తూ ఉంది. ఆ సంధ్యాముహూర్తంలో చల్లని గంగాజలాల్లో స్నానంచేసి పొడిబట్టలతో ఆ మంటపం సోపానాల మీద కూర్చుండి ఉన్నాను. స్వామిజీ—శిష్యవర్గంతో వచ్చి స్నానం చేశారు. సంధ్యావందనం జరిగింది. వెండితీగలులాగ అలుముకొనిపోయిఉన్న ఆయన కేశజాలం - గడ్డం - బంగారువంటి ఆ శరీరం మీద ఎంతో మహత్తు ప్రకటిస్తూ ఉన్నవి. ఆయన సాక్షాత్తూ దివ్యపురుషుడే. ఈ లోకంలో ఆయన తిరుగుతూ ఉన్నాడే కాని అన్ని లోకాలూ ఆయనలోనే ఉన్నవేమో! సమస్త విశ్వరహస్యాలూ గ్రహించినట్టు ఆయన విశాలనేత్రాలు విప్పారిన దృష్టులతో ఏవో ఎవరికీ తెలియని విశేషాలు ఆకళింపజేస్తూ ఉన్నాయి. ఆ మహనీయుని చూడగానే నా ఆరాటమంతా పటాపంచలయింది. స్వామి వస్తూ ఉన్న మార్గంలో సాష్టాంగపడి ఆయన పాదాలకు మొక్కరిల్లాను. స్వామి తమ దయాపాంగ దృష్టులతో అనుగ్రహించారు. వెంట రమ్మని సైగచేశారు. ఆశ్రమంలో శిష్యుడిగా ప్రవేశించాను. అక్కడే భోజన మజ్జనాదులు. నిత్యవిధులకి లోపం లేకుండా జరిగిపోతూ ఉంది. కాని మనస్సులో మరొక కొత్త అశాంతి బయలుదేరింది. ఏదో తెలుసుకోవాలని ఉబలాటం. నేనేం కోరుతున్నానో నాకే తెలియదు. ఆవేళ స్వామి ఒంటరిగా ఉన్నారు. ప్రసన్నభావన చూచి సమీపించి మళ్లీ సాష్టాంగ నమస్కారం చేశాను. ఏదో దివ్యతేజస్సు తనలో ఇముడ్చుకున్నట్టు అయింది.

"నీకేం కావాలి?" అని స్వామిజీ ప్రశ్నించారు మౌనదృష్టులతో.

అల్పసంతుష్టినైన నాకు అంతకంటె గొప్ప వరం కోరాలని బుద్ధి కలగలేదు. నా చెయ్యి చాచి, స్వామివారికి స్పష్టంగా చూపిస్తూ, "మహాత్మా! నా భవిష్యత్తులో, ఎలాగ ఉందో నా భాగ్యరేఖ చూచి చెప్పండి" అని అడిగాను. ఆయన చిరునవ్వుతో నా చెయ్యి తాకి నా కన్నులు స్పృశించారు. ఒడలంతా ఒక విద్యుత్ప్రసారం కలిగినట్టు జలదరించిపోయింది. ఒక కొత్త లోకంలోకి తీసుకొనిపోయి విడిచి యిక్కడ కన్నులు తెరచిచూడు అన్నట్టు అనిపించింది. నా నరాలన్నీ జ్వలించిపోయాయి. అకస్మాత్తుగా పెద్ద విద్యుచ్ఛక్తి ప్రవహిస్తే ప్రకాశించిన జ్యోతిలాగ నా శరీరం పులకరించి పోయింది. మొదట నేను సమాళించుకోలేకపోయాను. కొంతసేపు స్పృహతప్పి పడిపోయాను. నేను తెలివివచ్చి చూచేటప్పటికి స్వామిజీ పో—వెళ్ళిపో అని సంజ్ఞ చేస్తున్నారు. 'నీవు భాగ్యరేఖ చూడాలని చూశావు. ఎందుకు నీకు ఈ కుతూహలం! ఒకరు నీ భాగ్యరేఖ చూడటం ఎందుకు? నీ వే

అందరి భాగ్యరేఖలూ చూచి వాళ్ళ భవిష్యత్తు చెప్పగలవులే పద!" అని చెప్పినట్టు అర్థమైంది. నేను మారుమాటాడలేదు. నా చేతిలో రేఖలు చూచుకున్నాను. అవన్నీ కదుల్తూఉన్న జీవాలలాగ కనిపించాయి. వాటికి ఎక్కడలేనీ శక్తి వచ్చి-అవి ఎక్కడికో నన్ను లాగుకొనిపోతున్నాయి. స్వామి ముందు నా చేతులతో పాదాలు స్పృశించి, ఆ మంత్రశక్తి కళ్లకు అద్దుకున్నాను. ఇదివరకు ఎన్నడూ లేని ఉత్సాహం వచ్చింది. నాలో కొత్త ప్రజ్ఞ బయలుదేరింది. నేను ఒక ప్రయోజకవంతుణ్ని అయ్యాను. నేను చదివినప్పుడు, సంపాదించినప్పుడు - ఆఖరికి నన్ను ప్రేమించిన ఒక స్త్రీ అనురాగాన్ని పొందినప్పుడు కూడా ఇంత ఆనందాన్నీ ఉత్సాహాన్నీ పొందలేదు. స్తబ్దుగా ఎప్పుడూ నిద్రపోతూ ఉన్నట్టు కునుకుపాట్లు పడే నాలో గొప్ప చురుకుదనం పుట్టుకొనివచ్చింది. ఏదో చేసివెయ్యాలని - ఎన్నో చెయ్యగలనని ధైర్యం! ఇదివరకు నన్ను గేలిచేసి నన్ను నిరాకరించిన నెట్టివేసిన లోకం నన్నీ మాటు ఏలాగ ఆదరిస్తుందో చూడాలి. లోకానికి భయపడి తప్పించుకొని పరారీ అయిన నేను తిరిగి లోకంలోకి వస్తున్నాను. పరిస్థితుల ప్రభావానికి పలాయన మంత్రం పఠించిన నేను తిరిగి పరిస్థితుల్ని నా ప్రభావంలోకి తెచ్చుకోవడానికి పరాక్రమిస్తున్నాను. ఇంతకీ అదొక మానసిక శక్తి. ముంగు నిర్వీర్యుణిగా చేసి నిస్పృహతో ఆత్మహత్యకు త్రోసిందీ అదే—ఈనాడు—సమస్తాన్నీ జయించగల వీరాధివీరుడవు—పద ముందుకు పద అని విజృంభింప చేస్తున్నదీ అదే. అయితే ఈ శక్తి నాలో ఉన్నది. ఇన్నాళ్ళూ చూచుకోలేదు. ఒక మహనీయుడు వచ్చి నా శక్తి నాకు జ్ఞాపకం చేసేవరకు ఆ చింతనే లేకపోయింది'

ఇలాంటిశక్తి అందరిలోనూ ఉంటుంది. కాని ఎవ్వరో కాని తెలుసుకోలేరు. తెలుసుకోవడానికి ప్రయత్నం చెయ్యరు. ఎలాంటి పరమ వేదాంతమైనా యీ పరమ రహస్యాన్నే పరిపరి విధాల బోధిస్తూ ఉంది. 'నాయనా! నిన్ను నీవు తెలుసుకో—నీకు సమస్తం బోధపడతాయి' అని నన్ను నేను పూర్తిగా తెలుసుకోలేకపోయినా నాలోఉన్న కొత్తసామర్థ్యాన్ని గుర్తుపట్టాను. ముందంజవేశాను.

బికారీచరణ్ తన ఆత్మకథ చెప్తూ ఉన్నంతసేపు నేనూ ఆచార్యా కూడా అత్యంత శ్రద్ధతో విన్నాం. మాకు అత్యాశ్చర్యం వేసింది. ఆ ఆశ్చర్యం సరిపుచ్చుకోవడానికి మధ్య మధ్య ఏవో ప్రశ్నలు వేసేవాళ్ళం. అతను కూడా వానికి తగిన సమాధానాలు చెప్పేవాడు. ఈ భాగ్యరేఖలు చదివే సామర్థ్యం వచ్చినట్టు తొలిసారి యెలాగ తెలిసిందో వినాలని కుతూహలం కలిగింది.

'బికారీబాబు! సరే. ఇది గురువుల ప్రసాదంవల్ల నీకీశక్తి కలిగింది అంటున్నావు. ముందు ఎవ్వరిమీద నీ మంత్రం ప్రయోగించావు అది యెలాగ పనిచేసింది' అని ఆచార్య అడిగాడు.

బికారీ మరొక సిగరెట్టు అంటించి 'అయితే వినండి చెబుతాను. తొలిసారి నా శక్తి నావాళ్ళమీదనే ప్రయోగించాను. అది చాల విచిత్రంగా జరిగింది...అదీ తమాషాగానే ఉంటుంది' అని మళ్ళీ మొదలు పెట్టాడు. మేము ఇద్దరమూ ఎప్పటిలాగే చెవులు రిక్కించి వింటున్నాము.

భవిష్యత్తులోకి చూచే ప్రజ్ఞాశాలి తన అనుభవం వర్ణిస్తూ ఉన్నాడు.

నాకీ తెలివికలిగిన వెంటనే స్వగ్రామంవెళ్లిపోయాను. ఇదివరకు నిరాదరణతో చూచిన వాళ్ళంతా నేనంటె ఆదరంతో చూడటం ప్రారంభించారు. మనిషికి తన సామర్థ్యం మీద ధైర్యం కలిగిన ఉత్తరక్షణంలోనే ఇతరులుకూడా అతని సామర్థ్యాన్ని గుర్తిస్తారేమో! నామీద 'వలి' లేదు, కులభ్రష్టత్వం లేదు. ఇంటికి తిరిగి వెళ్ళిన వెంటనే మాతండ్రి ఆప్యాయంతో పలుకరించాడు. తల్లి పుట్టెడు దుఃఖంతో పొంగి పొంగి యేడ్చింది. వాళ్ళను చూస్తూ ఉంటే, నాకుకూడా దుఃఖం పొంగి పొంగి వచ్చింది. మనస్సుతీర యేడ్చివేశాను. ఇన్నాళ్ళు అనుభవించిన దుఃఖాలన్నీ కన్నీటిధారలుగా నా చెంపలు తడిపివేశాయి. చంటిపాపగా కనిపించాను మావాళ్ళకు. పరారి అయినవాడు ఎలాగో ఇంటపట్టు చేరాడుగదా అని మావాళ్ళ సంతోషం. ఈలోపున నా చరిత్ర అంతా సవిస్తరంగా వాళ్ళకు తెలిసిందట. నేను రైలుబండిమీంచి పడటం, మూడు ఆపరేషన్లు చేయించుకోవడం, తిరిగి 'బికారి' గా తిరగడం, కాంగ్రెసు ఉద్యమంలో జెయిలులోకి వెళ్ళడం, అక్కడనించి ఋషీకేశ ఆశ్రమంలోకి వెళ్ళడం ఇవన్నీ తెలిశాయి. ఎలాగ నా ఆరాతీశారో నాకే ఆశ్చర్యం వేసింది.

నా పూర్వానుభవాలు చెప్పుకోవడంతో, బంధు మిత్రులతో కొద్ది దినాలు ఖులాసాగా గడిపివేశాను. భవిష్యత్తు తెలుసుకోవడంలో నాకు కలిగిన కొత్త ప్రజ్ఞమాట ఎవరితోనూ చెప్పలేదు. నాయంతట నేను ఈ విషయమై ప్రచారం చేసుకోవాలనే కోరిక లేకపోయింది. నా హస్తరేఖలు నేనే చూచుకొన్నాను. భాగ్యరేఖ పల్చగా గులాబీరంగుతో కనిపిస్తూఉంది. అది చూస్తూఉంటే, కొత్త ఆశ కొత్త ధైర్యం అంకురించాయి. భవిష్యత్తులోకి ఒక కిటికీ తెరచుకొని అందమైన ఆనందమైన ఒక అరణ్యసీమ నాకన్నుల యెదట ప్రత్యక్షమైనట్టు అయింది. నాయంతట నేనే భయపడి అది పరీక్షగా చూడటం మానుకొన్నాను.

మళ్ళీ ఈ ప్రసక్తి రాలేదు. మా 'మేనమామ' కు జ్యోతిషం అంటే కొద్ది అభ

మానం. వ్యవసాయం కాకుండా కోర్టు వ్యవహారాలలో తరచు తిరుగుతూ ఉంటాడు. నేను ఋషీకేశం వెళ్ళి, ఆశ్రమంలో ఉన్న ఆరా అతనే తీశాడట. అతడు ఒకసారి వచ్చి, 'ఏమిరా అబ్బాయి! స్వామి వారివద్ద ఉండి ఏమైనా జ్యోతిషం, వైద్యం వగైరా నేర్చుకున్నావా' అని అడిగాడు.

నేను ఏమీ బదులు చెప్పలేదు.

'నీ ముఖం చూస్తే ఏదో హస్తసాముద్రికం చెప్పగలవని తోస్తూఉంది - చెప్పు నాయనా' అని చెయ్యి అందించాడు.

నేను చెయ్యిపట్టుకుని వేళ్లు విప్పుతూ ఉంటే ఒళ్ళంతా కంపించిపోయింది. దీక్షగా చూచాను. ఏదో కుదిపి వేసినట్టు, కండరాలన్నీ కదలి నా మెదడులోకి వచ్చి, కన్నులవెనక కేంద్రీకరించి ఏవో తెలియని వర్తమానాలు చెవులో చెప్పుతున్నట్టు అయింది. అవి వింటున్నాను. ఏవేవో— తెరచిన పుస్తకంలోని వాక్యాలలాగ — ఆ రేఖలు కనిపిస్తూ ఉన్నవి. నేను యంత్రంలాగ మాటలాడివేశాను. మా మేనమామ కదలకుండా వింటున్నాడు. ప్రస్తుతం, ఒక కోర్టు వ్యవహారం అతన్ని బాధిస్తూ ఉన్నది. అతడు కొన్న ఒక యింటిగురించి తగాదా! అతని హస్తరేఖలు చూచి ఆ యిల్లు పెరడు, పెరటిలోని రావిచెట్టు, మదురు గోడలు, ఆ యింటి యజమానురాలు ఒక వితంతువు, మైనారిటీ తీరిన ఆమె కొడుకు ఇవన్నీ స్ఫురించాయి. ఇవన్నీ చెప్పి, ఈ తగాదా మూడురోజులలోపున రాజీ అవుతుందని, కొంత సొమ్ము ఖర్చు అయినప్పటికీ తగాదా మా మేనమామ పక్షానే పరిష్కారం అవుతుందని చెప్పాను. ఆమాట వినగానే మా మామ ఆనందానికి మేర లేదు. మూడురోజులూ మూడు క్షణాలలో గడచిపోయాయి. ఆ వేళ కోర్టుకి వెళ్ళనవెంటనే ఆ యింటి యజమానురాలు, కొడుకూ కూడా వచ్చి తగాదాగురించి రాజీపడి మా మామపక్షం ఇల్లు క్రయం వ్రాసియిచ్చారు.

దానితో నా ప్రజ్ఞసంగతి మేనమామ అందరికీ చాటింపు వెయ్యడం మొదలు పెట్టాడు. ఈలోపున ఎందరు వచ్చినా నేను దీక్షగా చూడలేదు. యథాలాపంగా చూడటం ఏదో చెప్పి వేయడమున్నూ. నేను ఇంటికి తిరిగివచ్చేటప్పటికే కుటుంబంలో ఒక పెద్దచిక్కు బయలుదేరింది. అది మా పెద్దచెల్లెలు వివాహం. అది యీడుకివచ్చి నాలుగేళ్లు అయింది. మా నాన్నగారు ఎంతప్రయత్నంచేసినా వివాహం పొసగలేదు. ఎవర్ని చూచినా వేలకువేలు కట్నాలు అడిగేవాళ్ళే! కాని ఎంతో కష్టపడి ఒక సరిబంధం చూచారు. వాళ్ళకు రెండువేలు ఇవ్వడం - వాళ్లు పిల్లకు వెయ్యిరూపాయల నగలు పెట్టడమున్నూ. ముహూర్తం నిశ్చయంచేశారు; ఇంక వారంరోజులలో వివాహం. శుభలేఖలు కూడా అచ్చువేయించారు. ఒక పూట నేను ఒక్కడినూ ముందు గదిలో ఉండగా పెళ్లికూతురు, మా పెద్ద చెల్లెలు లక్ష్మి గదిలోకి వచ్చి "అన్నయ్యా! నువ్వు చేతులు చూస్తావట. నా చెయ్యి చూచి చెప్పు" అన్నది. లక్ష్మికి నేనంటే చనువే. కాని నేను దేశద్రిమ్మరిని అయిపోయినప్పటికీ అందరికీ నాముందు కూడా 'మన్నన' అయిపోయింది. లక్ష్మి—అయినప్పటికీ తెగించి వచ్చివేసింది. దాని మనస్సులో భావం వేరు. ఈ సంబంధం దానికి నచ్చలేదు. అయినా నాన్న కుదిర్చినమీదట బలవంతంగా ఒప్పుకోవలసింది. పైగా రెండు వేలు తన నిమిత్తం పోస్తూఉన్నారనేటప్పటికి దాని మనస్సు తరుక్కునిపోతున్నట్టు అయింది. మరొకమాట—చిన్నప్పటినించీ మా మేనత్తకొడుకు ప్రసాద్‌ని దానికిస్తామని అనుకొంటూ వచ్చాం. మా నాన్నకీ, మావయ్యకీ ఉన్న వివాదాలవల్ల ఆయనకిష్టం లేకపోయింది. చివరికి ఈ సంబంధం నిశ్చయించారు. ముహూర్తం నిశ్చయమయింది పత్రికలు వేశారు.

నేను లక్ష్మి చెయ్యి చూచాను.

'అమ్మాయి! నీవు దిగులుపొంద నక్కర లేదు-నీకీ పెళ్ళి కాదమ్మా?" అన్నాను.

"అదేమిటన్నయ్యా? అన్నీ అయిపోతేను"

"అది వేరేసంగతి - యీ పిల్లవాడితో కాదు; మరొక పిల్లవాడితో అవుతుంది — అదే ముహూర్తంలో -తప్పక అలాగే జరిగి తీరుతుంది" అన్నాను. లక్ష్మి సిగ్గుతోనూ, ఆశ్చర్యంతోనూ ముఖం చూడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

వారం రోజులు పెళ్ళి సన్నాహాలతో మా యిల్లు చాల హడావిడిగా ఉంది. లక్ష్మిని చివరి మూడు రోజులూ పెళ్ళికూతుర్ని చేసి రకరకాల అలంకరించి, ఆడవాళ్లు హాస్యం చేస్తూనే ఉన్నారు.

పెళ్ళికి బంధువులందరూ వచ్చారు. తెల్లవారితే 3 గంటలు అనగా ముహూర్తం. పెళ్లికొడుకుతరఫువాళ్లు సాయంకాలం వస్తారు. మా యింట్లో దూర బంధువులూ, దగ్గర బంధువులూ ఆ రోజు

(48-వ పేజీ చూడండి)

సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 6

ఒక పెద్ద సారాజాడీ వీధిలోపడి భళ్ళున పగిలింది. జాడీని బండిమీదనుంచి క్రిందికి దించుతుండగా, దొర్లి రోడ్డుమీద పడ్డది. సారాదుకాణం గుమ్మంలోనే ఈ సంఘటన జరిగిరది.

చుట్టూవున్న జనమంతా, పనిపాటలకు సోమరితనానికీ స్వస్తిచెప్పి, ద్రాక్షసారా ఏ గుక్కెడయినా దక్కుతుందనే ఆశతో ఈగల్లా ముసిరారు. ఆ ప్రదేశంలో, రోడ్డు, కంకరరాళ్లు కోసుల్లా బయటికి పొడుచుకొచ్చి, దారినిపోయేవాళ్లందరికాళ్లూ విరగ్గొట్టాలనే వుద్దేశంతో వేసినట్టుగావుంది. ద్రాక్షసారా ఆ కంకర్రాళ్ళచుట్టూ జలజలా ప్రవహించి మడుగులు గడుతోంది. ఒకొక్క మడుగుచుట్టూ ఒకొక్క గుంపు జేరారు. ఒకొళ్లనొకళ్లు మోచేతుల్తో పడదోసుకుంటున్నారు. కొంతమంది మగాళ్ళు, మోకాళ్ల తండావేసి సారా దోసిళ్ళతోయెత్తి తాగుతున్నారు. తమ భుజాలమీదకు వంగి వెనకట్టున నిల్చునున్న యువతీరత్నాల నోళ్లకు అందిందుతున్నారు. మరికొంతమంది జాడీ పెంకుల్లోకీ, కుండ పెంకుల్లోకీ, సారా పట్టుకుని కుక్కల్లా కతుకుతున్నారు. కొంతమంది తల్లులు, నెత్తిమీది రుమాలుగుడ్డలుతీసి సారాలో తడిపి పసిపిల్లల నోళ్లల్లో పిండుతున్నారు. ఇంకా కొంతమంది, రోడ్డుమీద సెలయేళ్లు గడుతున్న సారా ప్రవాహాలకు మట్టి అడ్డంపోసి ఆనకట్టలు కడుతున్నారు. ఇంకా కొంతమంది జాడీపెంకులు నాకుతున్నారు. మరికొంతమంది సారాతో తడిసిన తడిమట్టిని చప్పరించుతున్నారు—కొస్త రుచైనా తెలుతుందని; రోడ్డుమీద సారా అంతా ఆఖరైపోయింది. సారాతోపాటు మట్టికూడా చాలావరకు అదృశ్యమైపోయింది — పాకీవాడు తోడ్చుకు పోయినట్టు.

ఈ సారాఉత్సవం సాగినంతసేపూ—రోడ్డంతా కోలాహలంగా వుంది. ఆడా మగా, పిల్లాజెల్లా ఉల్లాసంగా కేకలు వేస్తూ సరసల్లాపాలలో మునిగి తేలారు. పరస్పరాభినందనాలూ, పరస్పరాలింగనాలూ ముద్దులూ, ముచ్చట్లూ కొట్టి కోలాహలంగా వుంది. మందిమీద ఆనందోత్సవం—ఒకళ్ల చేతులొకళ్లు పుచ్చుకుని బృందనృత్యాలు చేస్తున్నారు. ఈ ఉత్సవ కోలాహలం ఎంత హఠాత్తుగా ఆరంభమైందో, మళ్లా అంత హఠాత్తుగానూ ఆగిపోయింది. ఎక్కడివాళ్ళక్కడ వెళ్లిపోయారు. రంపాన్ని కొయ్యచెక్కలో ఆపళంగానే వదిలేసివచ్చిన మనిషి, తిరిగి వెళ్లి రంపంకోత ప్రారంభించాడు. తిండీ తిప్పలూ లేక నరాలు పీక్కుపోయి తీపులుపెడుతుంటే, ముంతలో నిప్పులుబోసి తనవళ్లూ, బిడ్డవళ్ళూ కాచుకుంటూ కూర్చున్న పేదరాలు, కుండ గుమ్మంలో పారేసి సారాఆశతో పరుగెత్తుకొచ్చింది. తిరిగివెళ్లి చూచుకుంటే కుండలో బొగ్గులు చాలా వరకు చల్లబడి పోయినై. చింకి గుడ్డలతోనూ, జీబుతలలతోనూ నేలమాళిగలనుంచి ఎలుకల్లా పరుగెత్తుకొచ్చిన నిర్భాగ్యులంతా, ఎక్కడి వాళ్ళక్కడ మళ్ళా కలుగుల్లోకి వెళ్లిపోయారు. తిరిగి ఆ ప్రదేశమంతా విషాద మేఘాలు ఆవరించి శిమ్ముమనిపోయింది. వెలుగురేఖలకంటే, అంధకారచ్ఛాయలే ఆప్రదేశానికి సహజంగా కనుపించుతున్నయ్.

ఎర్రటి ద్రాక్షాసవం—ఆ సారాతో తడిసి, పారిస్‌లోని సెయింట్ ఆంటొనీ వీధి మరకలైపోయింది. అనేకమంది చేతులూ, ముఖాలూ, పాదాలూ, కొయ్యచెప్పులూ, అన్నీ ఎర్రబడిపోయినై. రంపకోతగాడి చేతిలోవున్న రంపపు పిడి ఎర్రబడిపోయింది. తలకు చుట్టుకున్న రుమాలు ముందుకుపడి, బిడ్డకు పాలిస్తున్న తల్లి నుదురు ఎర్రబడిపోయింది. ఆశగా జాడీపెంకులు నాకిన కొందరి మూతులు, పెద్దపులి నోళ్లలా జేవురించిపోయినై. ఒక విదూషకుడు ఒక గోడమీదికి ఎగబ్రాకుతున్నాడు. అతని తల, మురికి పంచీలా వున్న టోపీలో వుండటానికి నిరాకరించి బయటికి నిష్క్రమించుతోంది. అతని వ్రేళ్ళకు అంటివున్న సారాజిడ్డుతో గోడనిండా మరకలైనై—రక్తం!

ఆ రకం, కూడా నడిపీధి కంకరరాళ్లలో ప్రవాహాలు గట్టవలసిన తరుణం ఆసన్నమౌతోంది. ఆ మరకలతో అనేకమంది చేతులూ ముఖాలూ మలినం కావలసిన రోజులు చేరువౌతున్నయ్.

ఇక యిప్పుడు—సెయింట్ ఆంటొనీముఖాన విషాద మేఘాలు ఆవరించివున్నయ్. చలి, మురికి, రుగ్మత, అజ్ఞానం, ఆకలి—ఈ నీచదేవతలు ఆయనచుట్టూ పరివేష్టించి వున్నారు. మిల్లురాళ్ళలో అరిగిపోతున్న జనం, ప్రతివీధి మొగినీ నిల్చుని చలికి గజగజలాడుతున్నారు. ప్రతి ద్వారంలోనుంచీ బయటికి వస్తున్నారు. ప్రతి ద్వారంలోనుంచీ లోపలికి వెడుతున్నారు; విరిగిపోయిన కిటికీచువ్వల మధ్యనుంచి తొంగిచూస్తున్నారు. గాలికి కదిలిన ప్రతి చింకిగొంగడిలోనూ గిజగిజలాడుతున్నారు. వాళ్ళని అరగదీస్తున్న మిల్లు ముసలాళ్ళను పడుచువాళ్ళను చేసేది గాదు; పడుచువాళ్ళను ముసలివాళ్లుగా తయారుచేసేది. పిల్లల ముఖాలన్నీ పితాళ్లముఖాలు; కంఠాలన్నీ రుద్ధకంఠాలు. ప్రతి ముఖంలోనూ, ప్రతి ముఖంమీది ముడతలోనూ ఒకే లిపి: "ఆకలి." ఆకలి, ఆకలి, ఆకలి—సర్వత్రా ఆకలిమయం. బాధకోనులన్నీ

(21-వ పేజీ చూడండి)

అనువాదం: తెన్నేటి సూరి




"కనకప్రవాసి"

జీభూతంలా చీకటి. జైలు ఆవరణంలో ఖైదీల గదుల్లో భీభత్స భయానకత ప్రదర్శిస్తున్నది. కొంచెం దూరంగా జైలు కటకటాల వెనుకనుంచి చలికి వణుకుతూ సన్నగా ఒక ఖైదీ అర్ధరాత్రి పాట పాడుతున్నాడు.

నెం. 12వ గదిలో వున్న రామ్మూర్తికి మెలకువ వచ్చి లేచి కూర్చున్నాడు. ఆ సాయంకాలమే అతన్ని జైల్లో వేశారు. ఇంకా ఆ రాతి గోడల మధ్య పది సంవత్సరాలు గడపాలి. 'నా' అన్నవాళ్లు ఎవరూ లేనందుకు, ఏకాకి అయినందుకు ఏడ్చాడు. తనకి ముప్పయ్యో పడిలో పది సంవత్సరాల శిక్షకి 'తనకోసం అని' పడి ఏడ్చేవాళ్ళెవరూ లేనందుకు ఆనందించాడు.

పది సంవత్సరాలు— ఒకటి, రెండూ కాదు 'పది'-'పది' అంకెలో ఎంతో భీభత్సం కనిపించింది రామ్మూర్తికి. ఈ పది సంవత్సరాల్లో 'ప్రేమ-పెళ్ళి-సౌఖ్యం పిల్లలు, గృహం' ఇన్ని సృష్టించుకోవాలనుకున్నాడు. కాని ఇప్పుడవేమీ లేవు. సురచిర సుందర స్వర్గం వికలమై అట్లా చూస్తూండగానే చేయి నుండి జారిపోయింది-ప్రజలకు దూరమైపోయాడు.

"పది సంవత్సరాలు"—నేను మళ్ళీ ప్రజల్లోకి ముసలివాడినైపోవాలి. స్నేహితులూ పరిచయస్థులూ అంతా నన్ను మరచిపోతారు. ఒక్కరికీ నా జ్ఞాపకం వుండదు—అదంతా మరో ప్రపంచంలా వుంటుంది—నా ఆలోచనలు అందులోకి చొరవు, నా పనులు ఏ ఒక్కటీ కూడ గౌరవించబడవు—ప్రజల మధ్య మళ్ళీ మాట్లాడటం, నడవటం, తినటం అన్నీ కొత్తగా నేర్చుకోవాలి. ఎంత నేర్చుకున్నా ఆ ప్రపంచానికి దూరమే-ముసలివాడినైపోతాను—కాని ఏమీ చేయలేను. చేయలేకపోతాను" అని తనతో చెప్పుకొన్నాడు రామ్మూర్తి. అట్లా ఆలోచించుకు పోతున్నాడు. నవనాడుల్లోనూ వెచ్చగా, ఉరకలు వేస్తూ ప్రవహించింది రక్తం - హృదయం, తల కాళ్లూ చేతులూ ఏ పనికీ పనికి రావన్నట్లు ప్రవహించే రక్తం శరీరాన్ని కదపి కదపి రోదించింది. ఆలోచించే ప్రతిసారీ విచారం అతని ఆలోచనల్ని త్రోసివేస్తూ దూరంగా విసరివేస్తూంది అతనిలో అతన్ని.

"ఈ గోడలమధ్య ఎందుకూ బంధించడం—నన్ను ఒక్కసారే కడతేర్చివుండవలసింది" అని బిగ్గరగా అరిచాడు. చుట్టూ నిలిచిన గోడలు ఏ సమాధానం ఇవ్వలేదు. అతనిలో నఖశిఖ పర్యంతం ప్రవహించే రక్తవాహిని విలపించింది. అతని మేధ, ఆలోచనలూ ఆగి ఆగి ఏడ్చి బాధగా గిరగిరా పరిక్రమించాయి. గట్టిగా ఏడుపుకోసం గింజులాడాయి.

మర్నాడు ప్రొద్దున్న ఎనిమిదింటికి అతనికి అన్నం పెట్టేరు. తిన్నాడు. ఎందుకు తిన్నాడో అతనికి తెలియలేదు.

"నేనెందుకు తింటున్నాను? ఇంకా ముసలివాడిని అవటానికే తింటున్నాను. అందువల్ల నాకేం లాభం లేదే!"—ఒకపూట అతను అన్నం తినటం మానుకున్నాడు. ఆకలి దహించి వేసింది. అన్నం తింటే బావుండును అని తోచింది. ఏదో నేర్చుకోవాల్సిందీ తెలుసుకోవాల్సిందీ బోలెడు వుండగా ఏమీ తెలుసుకోకుండానే ఉన్న కొద్ది జీవితం మధ్యలో చచ్చిపోవటం ఎంత దుర్భరం?—తిరిగి భోజనం వండించినప్పుడు అతను మరి ఆలోచించకుండా తినేశాడు. కాస్సేపటి వరకూ ఆలోచనలు విచారం దగ్గరనుంచి తప్పుకున్నాయి. ఏదో వింత అందం, అచేతనపు వస్తువుల్లో సహృదయత అతనికి చుట్టూ తోచింది.

ఒకచో ఆవరించిన పచ్చదనంలా, వరిపొలాల ప్రకృతి అందం పైరు గాలికి రెపరెపలాడుతూ బహు రామణీయకంగా వుంది. ప్రసరించే సూర్యుని తీక్ష్ణతకు మధ్య మధ్య మబ్బుల ఆటంకంతో ఆవరించిన పచ్చదనం రంగులు మారుస్తూంది. తూర్పు, పడమరల మధ్య ఉదయం సాయంకాలం రాత్రి చంద్రుడికిందా నక్షత్రాలకింద మహాద్భుతంగా ప్రకృతి మారిపోతూ వుంది, విలక్షణంగా మారిపోతూవుంది. రామ్మూర్తి లోపలకూడ అట్లానే వుంది—

భోజనం ముగించేసరికి మెరుపు శబ్దవేగంతో, నిత్య నవోద్వేగంతో తిరిగి ఆలోచనలు అతని దగ్గర కొచ్చాయి. అప్పుడు జ్ఞాపకం వచ్చింది రామ్మూర్తికి 'తను ఒక ఖైదీనికదా!'

"నాకు ముసలితనం వస్తే అప్పుడుకూడా పైరుచేల అందం ఇప్పటి మాదిరిగనే వుంటుందా! అప్పటి నా ముసలికళ్లతో మరి అట్టే చూడలేను!"—గోడకేసి ముఖం తిప్పుకొని ఏడ్చాడు. అదేగోడ ఎప్పుడూ తన ఆలోచనలకు కారణం అవుతూంది.

సరిగ్గా అదేగోడ! పాపం! అక్కడ ఎంత కాలంనుంచి వుందో ఆగోడ, అసలు ఎందుకొచ్చింది అక్కడికి అది! ఆగోడను కట్టిన వాళ్లెవరో! ఆ గోడకేసి పరీక్షగా చూడనారంభించాడు రామ్మూర్తి. అతను అనుకున్నంత పాత గోడకాదది. ఇంకా మంచి బలంగావుంది. అట్టే పాతబడలేదు. తన ముత్తాత అంత పాతది కాకపోవచ్చు—అయినా అది పాతదిలాగే కనిపించింది. ఆ పాతదనానికి వెయ్యిరెట్లు బలంవుంది కొత్తదనంకన్నా. ఎన్నో చిన్న జీవితాలు కృంగి, స్వాతంత్ర్యంకోసం ముసలరికాన్ని ధరించాయి ఆ పాతగోడల మధ్య ఇరుకు ప్రదేశంలోనే!

తనను తను అట్లా ఆలోచిస్తూంటే, ఆగోడ ఎట్లా వచ్చిందో, దాన్నెవరు నిర్మించారో రామ్మూర్తికి తెలిసింది. వాళ్ళంతా తన సోదరులే! తన దేశీయులే! వాళ్లు సంతోషంతోనూ, హృదయ పూర్వకంగానూ ఆ పనిచేయలేదు—అధికారులచే ఆజ్ఞాపించబడి, జీతాలు పుచ్చుకొని ఆ పని చేశారు—లేకపోతే పస్తులే! వాళ్లు ఈ గోడలు తమకోసం, ఇతరులకోసం కట్టారు. వెలుగు లేకుండా పైన చదును చేశారు, కిటికీలు లేకుండా చేశారు, వెలుగు ప్రవేశిస్తుందేమో అని భయం- ఉన్న ప్రదేశం కొంచమే! అయితే! ఎన్ని గదులుగా విభజించారో! వాళ్ళ సోదరులకోసం ఆనాడు సిద్ధం చేశారు.

అందులో మానవుడు ఎందుకూ పనికిరానివాడిగా దాచబడతాడు. స్వల్పం స్వల్పంగా తను తానే భూశయనం చేసుకోవడానికి—ఒకానొక రోజున ఒకడికి, మరొకడికి తేడా లేకుండా అనురూపంగా తయారవుతారు. ఈ పది సంవత్సరాల అతని దుర్భర జీవితం, ఆ గోడల ఆనంద సంరంభంలో ఎగిరిపోతుంది—

"తమ్ముడూ! ఒరే తమ్ముడూ! నాకోసమే కట్టావా ఈ ఖైదు!"

అని కేక పెట్టాడు రామ్మూర్తి. జైలుగోడలు నిర్మించిన తమ్ముళ్ళ మృతకాత్మలు కూడ ఏ సమాధానం ఇవ్వలేదు—అకస్మా

త్తుగా అతనిలో ఆలోచనలే వాటికి సమాధానం చెప్పాయి-"

"ఎందుకూ! మేం ఏమీ చేయలేం! మేమంతా ఈ పాడైపోయిన భాగాలం- అదిగో చూడు-అదే కన్నం! అని పిలవబడుతూంది-మానవులు ప్రపంచం అంతటా గోడలు నిర్మిస్తున్నారు. ఒకళ్లనుంచి వేరొకరు విడిపోయి, విడిపోయి తెలియనితనంలో, క్రూరత్వంలో, భయంలో- గోడలు నిర్మిస్తున్నారు. కారణం వాళ్ళకేం తెలియదు. అందుకే ప్రజలు ఒకళ్ళని చూచి మరొకరు భయపడుతుంటారు. భయపడుతూనే కిరాతకులై పోతారు. వాళ్లు ఇక్కడే కాదు గోడలు నిర్మిస్తే. ప్రపంచం ప్రపంచం అంతటిలో ఇట్లాంటివే గోడలు.

రామ్మూర్తి జైలు గోడ మీద చెయ్యి ఆనించాడు. దాంతో దాని బలం, లోతూ స్ఫురించినట్లయింది. ఎంత బాగా కట్టబడింది. ఈ కట్టుబడిలో ఎంత డాయి ఉపయోగించారో ఏమో ఈ జైలు మానవుడి అంతం ఎన్ని పదుల సంవత్సరాల్లో కాబోతున్నా చూస్తుంది.

"సోదరులారా!"అన్నాడు రామ్మూర్తి.

"నేను మీ కోసం చాలా చింతిస్తున్నాను. మీకు స్వేచ్ఛ రావటం అంటే నాకుచాలా దూరం అన్నమాట. మీరింకా ముసలివాళ్లు కాకుండానే నేను చావాలా! ముసలితనం మంచిదేకదూ! అవునా కాదా! కాని అది చాలా దూరాన వుంది."

జైలుగోడను జాలి దల్చాడు రామ్మూర్తి. మెరుపులా ఒక ఆలోచన తోచిందతనికి. ఆ ఆలోచన నిలబడి నిటారుగా అతనికేసి తీక్షతతో చూసింది. అది ఒంటి కాలిమీద ఒకే వ్రేలి మీద నిలబడినట్లుకూడతోచింది. చలనరహితంగా అట్లా కనిపించటానికా అన్నట్లు ఎంత కాంతివంతంగా వేగంగా అతి సిద్ధంగా వుంటుందని" తరవాత అది ఒక చేయి ఎత్తి తనని తట్టినట్లు అనిపించింది రామ్మూర్తికి.

"మనం బయటికి పోదామా!" అంది ఆలోచన.

"ఈ కటకటాలు గోడలూ మనల్ని వెళ్ళనివ్వవు-మనం ఇప్పుడు ఖైదులో వున్నాం" అన్నాడు రామ్మూర్తి.

"నాకు అవకాశంలేని గోడ అనేదే లేదు" అతని ఆలోచన చెప్పింది. అది కాలితో అతన్ని ఒక్క తాపుతన్ని మాయమైంది. కాస్సేపు చూసి మళ్ళీ దగ్గరకు వచ్చింది.

"బయట సూర్యుడు నిన్నటి వర్షంకూడ చూడకుండా ఎట్లా ఎర్రనైపోతున్నాడో" అంది.

"అవును" అన్నాడు రామ్మూర్తి వెంటనే.

"అక్కడ వర్షం బాగా కురిసింది" అతని ఆలోచన ఇంకా ముందుకు సాగింది. బావులు నిండి వున్నాయి. పర్వతాలనుంచి వర్షపు నీళ్లు జేగురురంగుగా విసురుగా ప్రవహిస్తున్నయి. బురద నిలవ నీటిలో కప్పలు పాటలు పాడుతున్నాయి. వరి పొలాలు ఇంకా పచ్చగా కనుపించటానికి ప్రయత్నిస్తున్నాయి."

"నాకు తెలుసు" అన్నాడు రామ్మూర్తి వర్ణన వినలేక విసుగ్గా. మిగిలిన ఆలోచనలు వట్టంగా మూగుతున్నాయి. అతను లోపలకూ బయటకూ తిరుగుతున్నాడు. వాళ్ళు అధిగమించలేని 'గోడే లేదు' అది మాత్రం నిజం. అవి అతనిలో చొరబడుతున్నాయి. అతని చుట్టూ ముసిరినాయి. రామ్మూర్తి వాటి ఇష్టం వచ్చినట్లు రానిస్తున్నాడు, పోనిస్తున్నాడు. వాటన్నిటికి స్వాగతం చెప్పాడు. అవి అతనిలో నిలవదల్చుకుంటే నిలవచ్చు పోదల్చుకుంటే బయటికి పోవచ్చు.

రామ్మూర్తి ఒక రకమైన స్వాప్నికదశలో కూర్చునిపోయాడు. "ఈ గోడ ఇట్లా నీరసంగా క్షీణించిపోతూందేం" తనలో తాను చెప్పుకొని నవ్వుకొన్నాడు. ఆనవ్వుతున్నప్పుడు అతని ఆలోచనలు బయటికీ లోనికీ తిరుగాడాయి.

* * *

ప్రస్తుతం అతను సంగీతం ప్రారంభించాడు. మొదట కప్పల పాటలను అనుకరించాడు, తరువాత పక్షులవి. -భోజనాలకు ఖైదీలను బయటికి తీసికొని వచ్చారు. ఒక్కసారి బయటి ప్రపంచం చూదామని దగ్గరగా వున్న కొంచెం ఎత్తయిన ప్రదేశం ఎక్కి చుట్టూ అవలోకించాడు. ఆనందం పట్టలేక రెండు మూడు సార్లు ఈలలు వేశాడు. జైలరు రామూర్తిని ఒక్క కేక వేసి క్రిందకు దిగమన్నాడు. అతని మాట రామ్మూర్తి లెక్క చేయలేదు- అట్లానే నిలబడి గట్టిగా నవ్వ ప్రారంభించాడు "ఉన్నతుడా! సర్వరక్షకా! దయాళూ! నన్ను క్షమించు-నన్ను. నేను మరచిపోయాను-నే నిప్పుడెక్కడున్నానో నాకు జ్ఞాపకంలేదు. ఇవాళ ఎంతో అందమైన రోజు-మరి కాదూ?"

జైలరు కోపగించి, రామ్మూర్తిని నెం 12 లోకి గెంటి తాళం వేసేశాడు. అతను

నిద్రపోదా మనుకున్నాడు. పూర్తిగా అలసిపోయాడు—కాని చాలా విచిత్రంగానే అతనిలోనికి బలం వచ్చింది— "నిజంగా అతను చెప్పినట్లు అది ఒక అందమైన రోజు."

ఆ తర్వాత రోజులు మరింత అందంగా దొర్లిపోయాయి. అతని ఆలోచనలు మరింత వేగంగా ప్రయాణించాయి. అతన్ని అవి ఎప్పుడూ ఒంటరిగా వొదలేదు. అత నెప్పుడూ తన్ను తాను మరచిపోతున్నాడు. అది తెలీసికోకుండా పాటలుపాడుతున్నాడు. రామ్మూర్తి చేసే గోలకు జైలరు ఎన్నో విధాల అతన్ని శిక్షించాడు. లాభం లేకపోగా పై అధికారికి ఫిర్యాదుచేసి మరో గదిలో రామ్మూర్తిని పెట్టించాడు. ఇన్నిటినీ అతిక్రమించి రామ్మూర్తి పాడుతున్నాడు. తన కుటుంబీకులు పదిమంది ఒకేసారి చనిపోయినట్లు కూడ ఏడుస్తున్నాడు. స్వతంత్రుడుగా వున్న రోజుల్లో జీవితం ఎన్ని విధాలుగా అతన్ని గాయపరచిందో, అన్నిటినీ ఒకటి తర్వాత ఒకటిగా అతను క్రుంగదీస్తున్నాడు. అతని హృదయంలోని ప్రతి గాయంనుంచీ 'దయాత్వం' అనేది ఇంకా పైకొచ్చి అతన్ని సంఘం నలుగురిలోనూ ఉంచ చూస్తూంది— రామ్మూర్తి జైలుగది ఈ విధమైన చిన్న చిన్న దయాత్వాలతో నిండ నారంభించింది. అవి ఇతన్ని కలియజుట్టి కూర్చుని వున్నాయి. అవి అతనిపై జాలిగా వ్రాలుతాయి. అవి నవ్వుతాయి—వెక్కిరిస్తాయి. అతన్ని ఇటూ, అటూ త్రోసివేస్తాయి. ప్రతీ ఉదయం అతను లేచేసరికల్లా అవి రామ్మూర్తిని 'సువిశాల భావాంబర వీధి' లోనికి నెట్టుతాయి. అతను తన గది వదిలేసి ఆ రాతిగోడల్ని అధిగమించి, ఆతనికి ఏనాడూ పరిచయం లేని వాళ్ళ లోకంలోకి, ఏవో విచిత్రంగా మెరిసే మైదానాల్లోకి వాటితో వెళ్ళిపోతాడు.

ఆ విచిత్రా లన్నిటిని అతను ఒక పాట క్రింద అల్లుకుంటున్నాడు. నిశ్శబ్దంగా కూర్చుని బుఱ్ఱలో ఆ పాటను పెంచుతున్నాడు రామ్మూర్తి. జైలరు అతన్నిగూర్చి అధికారికి మరి ఫిర్యాదు చేయలేదు. "అతనిలో ఉద్రేకం పూర్తిగా చచ్చింది. అతనిప్పుడు చాలా బాగున్నాడు"—అని జైలరు అధికారితో చెప్పాడు. సూపరింటెండెంట్, రామ్మూర్తి పిచ్చి ప్రవర్తన చాలామట్టుకు తగ్గినదని నిర్ణయించాడు. ఈ మూడేళ్ళ జైలు జీవితంలోనూ రామ్మూర్తి ఎన్నో వందల మంచిపేరులు తెచ్చుకున్నాడు జైలు అధికారులచే—కాని వాటినిగురించి రామ్మూర్తికి ఈ షత్తూ తెలియదు. అతను అల్లుతున్న పాట పూర్తి కావచ్చింది. దాన్నిగూర్చే అతను పూర్తి శ్రద్ధతీసికొన్నాడు—"

అది చాలా సొగసైన పాట. చిన్నపిల్లల్నిగూర్చీ తారుణ్యపు తొలిదినాల ఉత్సాహంగూర్చీ, జీవితం చివరిదశలో పరిశ్రమనునూ గూర్చే ఆ పాట అల్లాడు. పాట పూర్తయింది.

బయట ప్రపంచం అంతా పువ్వులూ, చిగుళ్లూ తొడిగింది. నిండు పచ్చదనాల వరి పొలాల సజీవహృదిలో సంగీతం తీగలు సాగుతూంది. ప్రతీ చెట్టూ చిరుగాలి





విసుగు రెపరెపలకు ఏవేవో కొత్త కొత్త సువాసనలు వ్యాపిస్తున్నాయి. మిలమిల లాడే ఆకులూ, కంకెలూ, తీగలూ, రామణీయక దృశ్యాన్ని జ్ఞాపకం చేస్తున్నాయి. రామ్మూర్తి ఆ అన్నిటి మధ్యా వున్నాడు. ఓ! అవును, అతను అక్కడే వున్నాడు. అప్పటికి అతని పాట సమగ్రసమాప్తి నందింది. చుట్టూ నిలచిన గిరిశిఖరిపై కెక్కి చుట్టూ గ్రామాలు, మైదానాలు చూస్తున్నాడు. ఆరోజు ఏదో పండుగ. ప్రజలు ఆ పండుగలో ఆనందిస్తున్నారు. ఎందుకు ఆనందిస్తున్నారో, ఎందుకు ఆనందించాలో వాళ్ళకే తెలియదు. కాని అతనికి తెలుసు. దానంతటికీ కారణం నిత్యజీవిత ప్రకృతిలోని పసితనం. అది మరొకసారి మానవుని భ్రష్టత్వం అనేదే యెరుగని నేత్రాలవైపు పరిశీలనగా చూస్తున్నది, విస్పష్టంగా చూస్తూన్నది. గతంలోని మెరిసే పవిత్రతకోసం-వందల, వేల సంవత్సరాల తప్పిదం, క్రౌర్యం ఆవరించిన ప్రపంచాన్ని మట్టబెట్టటానికి చూస్తూంది. కాని అది తప్పిపోయింది. ప్రకృతి, ఎప్పుడూ కాని 'పసిపాప' అయిపోయింది. రామ్మూర్తి తన బుఱ్ఱలో పూర్తయిన పాటతో, తన ఆలోచనామార్గాన్ని అనుసరించి గ్రామగ్రామానికీ వెళ్ళాడు. అతను వెళ్లిన చోటల్లా అతనికోసం అసంఖ్యాక ప్రజానీకం ఎదురుచూస్తూనే వుంది. అతను ఏమీ మాట్లాడటం లేదు. ఆ పాట భావం అతని ముఖంలోనే వుంది. ప్రజలు గుమిగూడి అతని ముఖంలోకి చూస్తున్నారు. అతని ముఖంలో చూచిన విషయం ఇతరులతో చెప్పటానికి పరుగెడుతున్నారు. అతనికన్న ముందు అతని పాటలోని భావం ప్రచారం జరుగుతూంది. ప్రతిచోటా స్త్రీలూ పిల్లలూ అతనిపై పూలమాలలు విసురుతున్నారు. పూర్తిగా పూలమాలలతో రామ్మూర్తి కప్పబడిపోయాడు. అనిర్వచనీయమైన గుబాళింపు అతని మెడను చుట్టివేసింది. తన చుట్టూ చేరిన ఆ ముఖాలను చూడలేకపోయాడు. జనుల కంఠాలను వినలేకపోయాడు. ఇంకా ముందుకు, ఇంకా ముందుకు అతను పరిక్రమించాడు, దీర్ఘనిద్ర వరకూ వచ్చాడు.

ఆ సాయంకాలం, సూర్యాస్తమయానికి కొంచెం ముందు జైలరు రామ్మూర్తి గది తలుపు తెరిచి, లోపలకు చూశాడు. తిరిగి మరి చూడకుండా ఒకే పరుగు తీశాడు పోలీసు అధికారిని తీసికొనిరావటానికి. విషయం ఏమీ అర్థంకాలేదు పోలీసు అధికారికి. జైలు నిబంధనలుమాత్రం అతిక్రమించబడినట్లు తెలిసి భయపడి రామ్మూర్తి గదితలుపు వరకూ వచ్చాడు.

లోపల రామ్మూర్తి నిశ్చలంగా సమాధిలో కూర్చుని వున్నాడు. అతని చుట్టూ పువ్వులదండలు వ్రేలాడుతున్నాయి. గది అంతా సరిక్రొత్త వింతసువాసనలు వెదజల్లుతున్నాయి. ఆ గది ఆ సువాసనలతో నిండిపోయింది.

"ఏయ్! నీకా పువ్వు లెక్కడివి?" అధికారి ప్రశ్నించాడు రౌద్రమూర్తిలాగ. రామ్మూర్తి సమాధానం చెప్పలేదు.

"వెధవ్వేషం! వెళ్లి ఒక్కటి తగిల్చి య్యవోయ్, వెధవ నిద్ర నటిస్తున్నాడు!" అన్నాడు అధికారి.

"నాకు భయం బాబూ!" అని జవాబిచ్చాడు జైలరు వణుకుతూ.

అధికారి విసురుగా వెళ్ళి ఆ పని తనే చేశాడు. అధికారి స్పర్శతో అతనికి రామ్మూర్తి సాష్టాంగపడినట్లు సాగిలపడ్డాడు. అతని ముఖం భూమికి ఆనింది. ఒక్కసారిగా అతని మెడచుట్టూ వున్న పువ్వులన్నీ వాడిపోయినవి. ఒక్క సువాసన మాత్రం మిగిలిపోయింది.

అధికారి వెనుదిరిగి భయంతో ఆ గది నుంచి ఒకేపరుగు తీశాడు. రామ్మూర్తి జీవితంలో ఎప్పుడూ అంత చచ్చిపోయినట్లు లేడు ఎప్పుడూ లేనంతగా మరణించాడు. అందుకే అధికారి భయభ్రాంతుడైనాడు.

తమకు అర్థంకాని విషయాలను గురించి సాధారణంగా మానవులు భయపడుతుంటారు. అదోమార్గం.

రామ్మూర్తి ఆ మూడేళ్ళూ జీవించిన ఆ గది గోడలకు అతని పాటపట్టుకొని వుంది. ఏవో అర్థంకాని నిరుపయోగమైన రహస్యాల్ని తనలో వుంచుకుంది. ఏ ఖైదీనయినా ఆ గదిలో పెట్టినప్పుడు వెఱ్ఱిగా ఒక పాటపాడతాడు. ఆ పాటకు అర్థం వుండదు. వున్నా తెలీదు.

జననానికి మరణానికి మధ్య
స్వాప్నిక నిరోధసంధ్యాకాంతి.'

(ఒక జైలుపక్షిని దృష్టిలో ఉంచుకొని)



# రెండు మహానగరాలు

(16-వ పేజీ తరువాయి)

ఆకలి, కొంపలూ, గోపికెలూ, గుడిసెలు, వెలిసెలు ఆకలికడుపుల కిటకిట. దణ్ణాలమీద ఆరేసివున్న చింకిగుడ్డలనిండా ఆకలి చాలికలు; తుక్కూ దుట్రా—గడ్డీ—పీలికలూ కాయితం ముక్కలూ అతుకేసివున్న చింకిబొంతలనిండా ఆకలిముద్రలు; పొగరాని పొగగూళ్ళలోనుంచి ఆకలి తొంగిచూస్తోంది; రొట్టెల దుకాణం బీరువాలమీద అదే ప్రకటన—"ఆకలి". మురిగివాసన గొడుతున్న ప్రతి చిన్నరొట్టెమీదా అదే ముద్ర; ప్రతిపులుసు డబరాలోనూ ఆకలి తైలం లేకుండానే వేగుతున్న ప్రతిబంగాళా దుంపముక్కలోనూ, అణువణువణువూ, ఆకలి పిడుగై పెటిల్లుమని పేలుతోంది.

అవకాశమున్న చోటల్లా ఆకలి వ్యాపించుతోంది. సందులు, గొందులు, ఇళ్లు వాకిళ్లు, మురికిగుడ్డలు, ముంజూటోపీలూ, సర్వత్రా; ఆ చింకి బొంతల మురికిజనం విడుస్తున్న నిశ్వాసాలతో వాయుగర్భం ఊద రెత్తుతోంది. తిరుగబడి కళ్లు పీకాలనే మృగస్వభావం, కొలిమి గుండాల కావురులా వాతావరణమంతా అలుముకుంటోంది. ఆరిపోయిన కొలిమిగుంటల్లా, దిగులుగా దించుకుపోయిన ఆ కళ్లల్లో అగ్నికణాలు అంకురించుతున్నయ్. బాధను ఓర్చుకోవటానికి పంటితో నొక్కిన పెదవిమీద, కొటువయ్యాలనే, కచ్చ కోరలా మెరుస్తోంది. సహించటమా, దెబ్బతియ్యటమా అన్న సందిగ్ధాలోచనలో వున్న నుదురులమీది ముడతలు, ఊరికంబాల త్రాళ్లల్లా పీటముళ్ళు పడుతున్నయ్. మాడు చెక్కలూ మంచి నీళ్ళూ ముందు బెట్టుకున్న నిర్భాగ్యులు ఎర్రటి ద్రాక్షావంత్రాగాలని దాహంగా ఆలోచిస్తున్నారు. ఒకరి చెవిలో ఒకరు ఈ ఆలోచనలను ఎలుగుగొడ్డులా గుసగుసగా చెప్పుకుంటున్నారు:

ఈ గుజగుజలన్నీ లోలోపలే; పైకిమాత్రం ఏ అలజడి లేదు; కాని, సానలమీది కత్తులు, సరసరా పదునెక్కుతున్నయ్ కమ్మరివాడి సమ్మెట, గదలా బరువెక్కుతోంది; తుపాకుల కార్ఖానాలో హననశక్తి అంకురించుతోంది; గోడప్రక్కనున్న పేవుమెంట్లన్నీ ఛిన్నాభిన్నమైనపవటానికి వీలులేకుండా కుక్కగోతులైనై. మురికాల్వల కట్టలు తెగి ముందున్న రోడ్డుమీదికి ఎగబడుతోంది. పట్టుమని పదిచినుకులు పడితే, ఇదేవి టదేవిటని యిళ్లల్లోకే జొరబడుతోంది. రోడ్డుకు అడ్డంగా కట్టివున్న తీగ మధ్య వ్రేలాడుతున్న, వీధిదీపం, మినుమినుకుమంటూ వెలుగుతూ అటూయిటూ ఊగిసలాడుతోంది. సముద్రంమీద ప్రయాణం చేస్తున్నట్టనిపిస్తోంది, రోడ్డుమీద పోతున్న జనానికి. అవును నిజంగా సముద్రమధ్యంలోనే వున్నారు—ఓడా నావికులూ కూడా తుపాను ప్రమాదంలో చిక్కుబడిపోయారు.

అవును అలాంటి సమయం రాబోతోంది. వీధి దీపానికి బదులు, మానవప్రాణులను వ్రేలాడదీసే సమయం ఆసన్నమౌతోంది. ఫ్రాన్సుగడ్డమీదికి తుపాను రేగబోతోంది. కాని ఆకాశాన ఎగురుతూ అందాలపాటలు పాడుతున్న, రాయంచగములు వాళ్లు తెలియని తమందంలో ఉల్లాసంగా కేరిసలు కొడుతున్నయ్.

ఆకుపచ్చని లాగూ, పసుపుపచ్చని వెయిస్టుకోటూ, తొడుక్కుని ఆ సారాదుకాణం యజమాని దుకాణం గుమ్మంలో నిల్చున్నాడు—రోడ్డుమీద సాగుతున్న సారా మహోత్సవాన్ని తిలకించుతూ. అంతా అయిపోయిన తరువాత భుజాలు ఎగరేసి: 'ఆ వ్యవహారంతో నాకేమీ సంబంధం లేదు. జాడీ పగలగొట్టుకుంది మీరే—మరో జాడీ తెస్తే తేండి లేకపోతే లేదు—నేను మాత్రం అచ్చుకోను' అని, బండిమీదినుంచి జాడీలు దింపుతున్న వాళ్ళను హెచ్చరించాడు. ఇంతలోనే గోడమీద ఎర్రగీతలు గీస్తున్న విదూషకుడు అతని కంటబడ్డాడు. 'అరే బాబా! ఏవిట్రా అదీ—అక్కడేం జేస్తున్నావ్?'—

విదూషకుడు ధీమాగా నిల్చుని గోడమీది అక్షరాలు చూపించాడు.

'ఏవిట్రా?—పిచ్చాసుపత్రికి పంపించాల్సిన బాపతా ఏవిటి?' అంటూ పరుగెత్తుకెళ్లాడు దుకాణదారు: ఇంత బురద తీసుకుని అక్షరాలమీద పులిమాడు: 'నడివీధి గోడలమీదరా ఇలాంటి మాటలు రాసేదీ?—నీకు మతుందా లేదా?'

ఇలా మందలించుతూనే, (ఆదమరుపునో యేమో) విదూషకుడి గుండెలమీద చెయ్యి వేశాడు. విదూషకుడు అమాంతం విదిలించికొట్టి ఒక్క గెంతుగెంతి కాలినున్న చెప్పు చేతిలోకి తీసుకుని సన్నద్ధుడై నిల్చున్నాడు.

'ఏడిశావు గాని తెలివితక్కువదద్దమ్మ—కాలికి తొడుక్కో' అంటూ తిరిగి సలహాయిచ్చాడు విదూషకుడికి. మరకైన చెయ్యి, విదూషకుడి గుడ్డలికే తుడిచి రోడ్డుమీది కెక్కి తిరిగి దుకాణం దగ్గరకొచ్చాడు.

దుకాణదారు ఎద్దుమెడ మనిషి; వయస్సు ముప్ఫయి సంవత్సరాలు; మంచి ఉష్ణతత్వంమనిషై వుండాలి—ఎంచేతనంటే—అంత గొడ్డుచలి గావున్నా, కోటు తొడుక్కో లేదు. ఊరికే బుజానికి తగిలించుకు తిరుగుతున్నాడు. చొక్కా చేతులు కూడా, మోచేతులవరకూ మడిచివున్నయ్. నెత్తిమీద కూడా, ఉంగరాలు చుట్టుకున్న జీబువెంట్రుకలు మినహా, మరో యితర ఆచ్ఛాదనేమీ లేదు. పెద్ద పెద్ద కళ్లు; బాగా దమ్ముబట్టి గాలిపీలుస్తాడు. సర్దామనిషే గాని మొండిరకం. ఏమైనాసరే పట్టినపట్టు విడిచే తత్వం కాదు. ఇరుపైపులా అఖాతాలుండి మధ్య ఇరుగ్గావున్న బాటమీద అతనికి ఎదురు తారసిల్లటం మంచిదిగాదు—ఏది ఏమైనా ప్రక్కకు తప్పుకోడు.

అతనిభార్య, మాడమ్ డిఫార్జ్, దుకాణంలో అమ్మకంబల్ల దగ్గిర కూర్చునుంది. ఇంచుమించు అతని వయస్సులోనే, లావాటి గుండ్రని మనిషి; ఎప్పుడూ ఎటూ చూడనట్టు కనుపించుతుంది గాని, ప్రతి విషయాన్నీ అతిజాగ్రత్తగా పరిశీలించుతూ వుంటుంది. వ్రేళ్లనిండా చిక్కిరొక్కిరిగా రాళ్ల ఉంగరాలు; నిమ్మకు నీరెత్తినట్టు నిబ్బరమైన ముఖం. అసలు మనిషిలోనే అలాటి స్థాయీభావం వుంది. మంచి లెక్కమనిషి; డబ్బు లెక్కజూడటంలో తనకు నష్టంవచ్చేలాగు తభావతు ఎప్పుడూ రానియ్యని నిర్దుష్టశీలంగల వ్యక్తి. చలికి ఓర్చుకోలేదు—అంచేత పెద్ద ఫర్ కోటు తొడుక్కుంది. చెవులకున్న రాళ్ళదుద్దులు మాత్రం కనుపించేలా వదిలి, నెత్తిచుట్టూ, ఎర్రటి శాలువా చుట్టుకుంది. చేతిలోవున్న కుట్టుసామాను, ముందున్న బల్లమీదబెట్టి, ఇత్తడి ముల్లుతో పల్లుకుట్టుకుంటోంది. ఎడంచెయ్యి కుడిమోచేతికి పోటీ ఆని, విరామభంగిమంలో కూర్చునుంది. భర్త లోపలికొచ్చాడు. అతన్ని ఏమీ పలకరించలేదు. కాని ఒక చిన్న పొడిదగ్గు దగ్గింది. అతను తల పైకెత్తి చూచాడు. నల్లగా తీర్చిదిద్దినట్లున్న ఆ స్త్రీ కనుబొమలు జలగలు సాగినట్లు కనుకొలకుల్లోకి సాగి, మళ్లీ వెనక్కి వెళ్లిపోయినై. 'ఈ కూర్చున్నవాళ్ళలో, నువ్వు బయటికి వెళ్లిన తరువాత లోపలికి వచ్చిన కొత్తవాళ్లెవరేనా వున్నారేమో చూడు' అని, ఆ కనుబొమల విన్యాసానికి అర్థం.

భార్య ఆదేశానుసారం అతను ఆ హాలంతా ఒక పర్యాయం అటునించి ఇటు కలియజూచాడు. మూలగావున్న ఒక బల్లదగ్గిర, తల నెరిసిన ఒక పెద్దమనిషీ, పడుచువయసులోవున్న ఒక యువతీ కనుపించారు. మిగతావాళ్లంతా పాతవాళ్లే; వాళ్లలో

ఇద్దరు చీట్లపేక వేస్తున్నారు; యిద్దరు పాచికలాడుతున్నారు. మరో ముగ్గురు అమ్మకంబల్లదగ్గిర నుంచుని గ్లాసుల్లోవున్న సారా, కొస్త కొస్తే నెమ్మది నెమ్మదిగా గుటకలు వేస్తున్నారు. దుకాణాదారు అమ్మకంబల్లప్రక్కకు రాగానే, మూలనున్న ఆ వృద్ధుడు, ప్రక్కనున్న యువతితో నెమ్మదిగా "అతనే ఆ మనిషి" అన్నాడు. ఆ మాటలు మాన్సియర్ డిఫార్జ్ చెవుల బడ్డయ్. 'ఎవడబ్బా! ఈ కిరాతుడూ ఎప్పుడూ మాళ్లేదే' అనుకున్నాడు, డిఫార్జ్ లోలోపల.

కాని డిఫార్జ్ ఆ క్రొత్తవాళ్లిద్దర్నీ చూడనట్టు వటించాడు. కౌంటర్ దగ్గిరున్న మూర్తిత్రయంతో బాతాఖానీ మొదలెట్టాడు.

'ఏవిఁటి కబుర్లు భయ్యా!' అని మాన్సియర్ డిఫార్జ్‌ని పలకరించాడు, వాళ్లల్లో ఒక ప్రబుద్ధుడు: 'ఒలికిపోయిన సారా యావత్తూ నాకేశారా ?'

'చుక్క లేకుండా'—

ఈ సంభాషణ విని, మాడమ్ డిఫార్జ్ హెచ్చరికగా మళ్లీ ఒక చిన్నిదగ్గు దగ్గింది—కనుబొమలు ఎత్తేస్తూ.

రెండోవాడు అందుకున్నాడు: 'ఈ భైతు లెప్పుడేనా సారామొహం చూసిన జంతువులైతేగా—చావు చాకిరీ, మాడు రొట్టెలూ—వీళ్ళ బ్రతుక్కి సారా ఎక్క డేడిసింది—ఏవంటావు భయ్యా ?'—

'అవ్వునే తమ్ముడూ'—అన్నాడు డిఫార్జ్.

పళ్లు కుట్టుకుంటున్న పడతీరత్నం మళ్ళీ ఒక దగ్గు దగ్గింది.

మూడోవాడు అందుకున్నాడు—ఎప్పుడూ ఎరగని యీ పశువులకు ద్రాక్షాసవం నాలిక్కి తగిలితే యేవిఁటి మరి!—ఏవంటావు భయ్యా ?'—

ఇక లాభంలేదని గమనించి, మాడమ్ డిఫార్జ్ చేతిలోవున్న పల్లుకుట్టు ముల్లు బల్లమీద పెట్టి, కుర్చీలో ఇటునుంచి అటు అలజడిగా మెసిలింది.

'అవును, సరే,—ఇక ఆపండి' అన్నాడు డిఫార్జ్ : 'ఈవిడ నా భార్య' అంటూ తన భార్యను ఆ మూర్తిత్రయానికి పరిచయం చేశాడు.

ఆ ముగ్గురూ ఒక్కసారి నెత్తిమీద టోపీలుతీసి ఆ మహిళా రత్నానికి జోహారులు పచరించారు. ఆవిడ వాళ్ళ ఆనతులు అందుకుని బల్లమీదవున్న కుట్టుసామాను చేతిలోకి తీసుకుంది; నిర్లక్ష్యంగా కూర్చుని తనపని తను చూసుకుంటోంది.

డిఫార్జ్ మూర్తిత్రయంవంక తిరిగి: 'బ్రహ్మచారులు విశ్రాంతి తీసుకునే హాలు, రెండో అంతస్తుమీద వుంది—ఇలా ఎడంచేతి వేపుగా వెడితే మేడమెట్లు కనుపించుతై—శుభం—వెళ్లరండి' అన్నాడు.

సారాబిల్లులు చెల్లించి, ఆ ముగ్గురూ బయటికి వెళ్లిపోయారు. దుకాణదారు తన భార్య కుడుతున్న లతవంక చూస్తూ అక్కడే నిల్చున్నాడు. ఇంతలో మూలనున్న ఆ వృద్ధుడు నెమ్మదిగా అతని దగ్గిరికి లేచొచ్చి:

'చిన్నమాట!—'అన్నాడు.

'చిత్తం' అంటూ, డిఫార్జ్, నాలుగైదు అడుగులు ఆ ముసలాయనతోపాటు యివతలికి గుమ్మంవేపుకు నడిచాడు.

సంభాషణంతా ఒక్క క్షణంలో ముగిసిపోయింది. ఆ ముసలాయన అతని చెవిలో ఏదో ఒకమాట ఊదాడు. దాంతో డిఫార్జ్ సర్వం గ్రహించేశాడు. తన వెంట రమ్మని సంజ్ఞచేసి బయటికి బయలుదేరాడు. ఆ ముసలాయన మూలనున్న ఆ యువతిని కూడా లేచిరమ్మని సంజ్ఞచేశాడు. ఇద్దరూ కలిసి, డిఫార్జ్‌ని అనుసరించి బయటికి నడిచారు. మాడమ్ డిఫార్జ్ నిర్లక్ష్యంగా వాళ్ల వంకేనా చూడకుండా తనపని తాను చూసుకుంటోంది.

జర్విస్ లారీ, మిస్ మానెట్ ఇద్దరూ సారాదుకాణంలో నుంచి దొడ్లోకి వచ్చి, మేడమెట్ల దరవాజా దగ్గిర డిఫార్జ్‌ని కలుసుకున్నారు. చుట్టూవున్న గదుల్లో వందలూ వేలూ జనం నివసించుతున్నారు. కావలసినంత మురికివాసన. చవుకు గారుతున్న యిటుకల మెట్లముందు మోకాటితండా వేసి, డిఫార్జ్, తన పాతయజమాని కుమార్తెకు జోహారు చేశాడు. ఆవిడ ముంజేయి పెదవులకు హత్తుకున్నాడు. ఈ మర్యాద యావత్తూ కేవలం లాంఛనప్రాయంగా నిర్వహించాడు. మరుక్షణంలో, యధాపూర్వంగా, అర్థంకాని ప్రమాదకరమైన కోపిష్ఠిమనిషిగా మళ్లీ మారిపోయాడు.

'చాలా ఎత్తు—ఎక్కటం మాటలుగాదు — నెమ్మదిగా రండి'—అంటూ నిలవకుండా మేడ మెట్లమీదికి దారితీశాడు.

'ఒంటరిగా వున్నారా ?'—లారీ గుసగుసగా అడిగాడు.

'ఒంటరిగా ఉండక !—అయ్యో బాబోయ్ !— ఆయనతో ఎవరుంటారు ?' అతను అదే గొంతుతో సమాధానం చెప్పాడు.

'అయితే ఎప్పుడూ ఒంటరిగానే వుంటున్నారన్నమాట.'—

'ఆఁ'

'ఆయన కోర్కమీదనే అలా వుంచారా ?'

'ఆయన అవసరంకొద్దీ; వాళ్ళు నన్నుపిలిచి ఆయన్ను నాకు చూపించి, సాధకబాధకాలన్నీ నెత్తిన వేసుకోదలిస్తే, నువ్వుతీసుకువెళ్లచ్చునన్నారు. సరిగా ఆ వేళ ఆయన్ను యే స్థితిలో చూచానో, ఇక్కడికి తీసుకువ

చ్చిన తరవాతకూడా అదేస్థితిలో అట్టే పెట్టాం.'

'ఆయన యిప్పుడు కొంచెం దారికి వచ్చివుంటూ రను కుంటాను.'

'అయ్యో బాబోయ్!—ఆయనలో మార్పా?'—

ఆ సమాధానంతో లారీ దిగ్గున దించుకుపోయాడు. ముగ్గురూ మెల్లెక్కుతున్నారు. మెట్లకు రెండువేపులా అనేకతలుపులూ కిటికీలూ వున్నయ్. గదులు వూడ్చిన పెంటపోగులన్నీ దరవాజాలలోనుంచీ కిటికీలలోనుంచీ మెట్లమీదే పారబోసివున్నయ్. ఆ పెంట పోగులన్నీ, మురిగి వాటిల్లోనుంచి బయలుదేరిన సువాసన వాతావరణమంతా వ్యాపించి ఊపిరితిరగకుండావుంది. ఆ విషవాయు గర్భంలోనుంచి ఒక్కొక్క మెట్టే పైకెక్కుతున్నారు. తన మనస్సంతా వ్యాకులమైపోవటం మాట అలావుంచి, తన వెంట వున్న ఆ యువతిస్థితి మరింత ఆందోళనజనకంగా వుండటం గమనించి, లారీ పోతూపోతూ రెండుచోట్ల ఆగాడు. ఆ ఆగడం మెట్లమీది నుంచి అవతలికి పోవటానికి త్రోవలున్నచోట ఆగాడు. బయటి నుంచి రవ్వంత మంచిగాలి యేమైనా లోపలికి సోకి ఊపిరి తిరుగుతుందేమోనని ఆశపడ్డాడు. కాని ఆ దరవాజాలలోనుంచి మరింత మురికివాసన మెట్లమీదికి కొట్టడం మినహా ప్రయోజనం లేకపోయింది. తుప్పపట్టిపోయిన కిటికీచువ్వలలోనుంచి చూస్తుంటే, నాటర్ డేమ్‌టవర్ ఈమధ్య ఆరోగ్యకరమైన జీవితమంటూ, ఆశయాలంటూ చూపుమేరదూరంలో ఏమీ కనుపించటం లేదు.

ఏదో విధంగా నానా అవస్థాపడి మేడమెట్ల చివరికి చేరుకుని మూడో పర్యాయం ఆగారు. అక్కడినుంచి పై మిద్దెమీదికి ఎక్కటానికి మరింత యిరుకుగావున్న మరో చిన్ని మెట్ల వరస ఎక్కవలసి వచ్చింది. మిద్దెమీది గదిముందుకు చేరగానే, డిఫార్జ్ కోటుజేబులు తడుముకుని ఒక తాళంచెవి బయటికి తీశాడు.

'ఏమిటి తలుపు తాళంకూడా వేసివుంచారా?' అన్నాడు లారీ, ఆశ్చర్యంగా.

'అవును'—డిఫార్జ్ ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

'ఆయన్ని అలా తాళంవేసి వుంచటం అవసరమా?'

'అవసరమే అనుకుంటాను.'

'ఎందుకూ?'

'ఎందు కేమిటి?—ఆయన యిన్ని సంవత్సరాలుగా తాళం పెట్టివున్న గదిలో వుండటానికి అలవాటుపడ్డాడు—ఇప్పుడు తాళంగీళం లేకుండా తలుపులు బార్లగా తీసే స్తే—ఆయనకి కంగారెత్తిపోవచ్చు—పిచ్చెత్తవచ్చు—జుట్టు పీక్కునుకోవచ్చు—చచ్చిపోవచ్చు—ఏ ప్రమాదమన్నా జరగొచ్చు'—

'నిజంగానా?'

'నిజంగానా అని నెమ్మదిగా అంటారేం?—జగత్తులో లక్షసంగతులు జరుగుతూండగా ఇదిమాత్రం ఎందుకు జరగ్గూడదు!'

ఈ సంభాషణ యావత్తూ మాసెట్ కన్యకు వినపడకుండా చాలా రహస్యంగానే జరిగింది. కాని యీ వాతావరణంలోనుంచి నడుస్తుంటేనే ఆవిడకు మతిపోయింది. విభ్రమ భయాందోళనలతో ఆవిడమనస్సు కళవళించిపోతోంది. ఈ విషయాన్ని గమనించి లారీ ఆవిడకు కొంచెం ధైర్యం కలిగేలాగు ఇలా అన్నాడు:

'భయంలేదు తల్లీ!—మరేం ఫరవాలేదు—ఏముందీ, వ్యవహారం, ధైర్యంగా చక్కబెట్టుకోవాలి—క్షణంలో ఆందోళనంతా తీరిపోతుంది—నువ్వు ధైర్యంగల తల్లివి ఆయన్ని లాలించి, సంతోషపెట్టి దారికి తెచ్చుకోగలవ్'—

తాళంతియ్యటానికి పూర్వం డిఫార్జ్ ప్రక్కనున్న పరంజా కన్నంలోనుంచి లోపలికి తొంగిచూచాడు. మళ్లా తలుపుదగ్గిర కొచ్చి తలుపుమీద రెండుసారు నెమ్మదిగా కొట్టాడు—తాళం చెవితో యిటూ అటూ నాలుగుసార్లు తలుపుమీద గట్టిగా గీశాడు—ఇదంతా, కేవలం కొంచెం అలికిడి చెయ్యాలనే ఉద్దేశంతో. తాళంచెవి, లోపలికి దోపి బలవంతాన తిప్పాడు.

తలుపులు నెమ్మదిగా తెరుచుకొన్నయ్. లోపలికి తొంగి చూసి యేదో అన్నాడు. లోపలనుంచి హీనస్వరంగా ఏదో సమాధానం వినిపించింది.

డిఫార్జ్ గడపలో నుంచుని, ఆ యిద్దర్నీ కూడా లోపలికి రమ్మని సంజ్ఞచేశాడు.

ఆ అమ్మాయి, బిక్కమొహంవేసి దించుకుపోవటం లారీ గమనించాడు. జాలిగా నవ్వుతూ చెయ్యివేసి ఆసరా యిచ్చి ముందుకు నడిపించుకు పోతున్నాడు.

'వ్యవ...వ్యవహారం తల్లీ!...' మాటలు తడబడ్డయ్—కనుకొలకులవెంట నీటిబిందువులు దిగజారినై, కేవలం వ్యవహారమే అయితే కన్నీటిబిందువు లేవిటో!—'రా అమ్మారా! లోపలికిపద!'

'అమ్మో నాకు భయమేస్తోంది'—గజగజా వణుకుతోంది.

'ఎందుకూ?'

'మా నాన్నంటే భయంగా వుంది'—ఆవిడ మాట్లాడిన కంగారుమాటలకి లారీ ధైర్యం చెయ్యవలసివచ్చింది. అమ్మాయిని పైకెత్తి బుజానవేసుకుని గిలగిలలాడుతుండగానే గదిలోకి నడిచాడు. గదిలోకి రాగానే క్రింద దించాడు. ఆ యువతి ఆయన్ని బల్లిలా కావిలించుకు నిల్చుని, గజగజా వణుకుతోంది.

ముగ్గురూ లోపలికివచ్చినతరవాత డిఫార్జ్ మళ్లా తలుపు మూసేసి, లోపలనుంచి తిరిగి తాళంవేసేశాడు. ఈ తాళంవెయ్యటంలో ఎంతశబ్దం చెయ్యటానికివీలుంటుందో అంత శబ్దం చేశాడు. అనంతరం గదికి అడ్డంగా నడిచి లోపలున్న కిటికీదగ్గిరకి వెళ్లాడు. అక్కడ నిల్చుని వెనక్కు తిరిగి చూశాడు. నిజానికి, ఆ గది, కట్టెలూ బొగ్గులూ దాచుకోవటానికి కట్టిన చీకటికొట్టుగాని మనుషు లుండటానికి కట్టింది గాదు. లోపలున్న కిటికీ కూడా చాలా చిన్నది. చలిగాలి లోపలికి రాకుండా వుండటానికి కిటికీ తలుపులు రెంటిలోనూ ఒకటి మూసేసి వుంది కూడా. లోపలికి వస్తూన్న వెలుగు చాలా స్వల్పంకావటంచేత, లోపలికి వెళ్ళంగానే ఆ చీకటికొట్లో ఏమీ కనుపించదు. ఆ చీకటికొట్లో కూర్చుని ఏదైనా నాజూకైన పని చెయ్యాలంటే, ఎన్ని సంవత్సరాలుగానో అలవాటుంటేగాని సాధ్యంగాదు. అయినప్పటికీ ఆ చీకటికొట్లో అల్లాంటి నాజూకుపని కొంత సాగుతోంది. డిఫార్జ్ నిల్చున్నచోటుకు ముందుభాగంలో, ప్రాంతం తల ముగ్గుబుట్టయిపోయిన ఒకవ్యక్తి, చిన్ని బెంచీమీద కూర్చుని తదేకధ్యానంగా చెప్పులు కుడుతున్నాడు. 




# అంతా ఒకటే



శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

ఒకటే
ఒకటే
అంతా ఒకటే
మే
మంతా ఒకటే
.................
తెలుగుతల్లి
పిల్లల
మంతా ఒకటే
మే
మంతా ఒకటే
తెలుగు పలుకు
పలికెడి పాపల
మంతా ఒకటే
మే
మంతా ఒకటే

బెజవాడ
గుడివాడ
తెలంగాణమూ
గంజాము
బరంపురము
చాందా జిల్లా
గుంటూరు
నెల్లూరు
కోలార్ జిల్లా
రాజమండ్రి
వైజాగు
రాయలసీమ
ఒకటే
ఒకటే
పిల్లల మంతా ఒకటే
కులమూ

గోత్రం
రంగూ.
రూపూ
ఉనికీ
ఉడుపుల
భేదం
ఎరుగని
చిట్టితల్లు
లంతా ఒకటే
చిన్నిబాబు
లంతా ఒకటే
ఒకటే
ఒకటే
అంతా ఒకటే
మే
మంతా ఒకటే.

# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

బొమ్మరిల్లు సీరియల్

## 18

నాకు ఆశ్రయమిచ్చిన కర్నల్ గ్రేంజర్‌ఫర్డ్ ఘరానా కుటుంబంలో పుట్టిన మనిషి. అసలు గ్రేంజర్‌ఫర్డు కుటుంబం యావత్తూ ఉన్నతవంశానికి చెందినదే. ఉన్నతవంశానికి చెందటమంటే మాటలుకాదు. ఉత్తమజాతిగుర్రాన్ని ఎంత గౌరవిస్తారో ఉన్నతవంశంవాళ్లని కూడా అంత గౌరవిస్తారు. ఈమాట నాకు డగ్లస్ అమ్మగారు ఇదివరకే చెప్పింది. మా వూళ్లోకల్లా ఆవిడే గొప్పకుటుంబపుమనిషి. మానాన్న తక్కువ తరగతివంశంవాడైనా వాడుకూడా ఉన్నతవంశీకులంటే అభిమానంకలమనిషే.

కర్నల్ గ్రేంజర్‌ఫర్డు పొడుగ్గా, సన్నగా ఉంటాడు. మంచి రంగుకలమనిషి. ప్రతిరోజూ పొద్దున్నే గడ్డంగీసుకునేవాడు. పల్చటిమొహం, పల్చటి పెదవులు, ఎత్తైనముక్కు, గుబురు కనుబొమలు, నల్లటికళ్లు — ఆ కళ్ళు లోతుగా నూతుల్లోంచి చూస్తున్నట్టుండేవి. నెరిసిన పొడుగాటి వెంట్రుకలు బుజాలమీద పడేవి. చేతులు పొడుగ్గా సన్నగా ఉండేవి. మామూలురోజుల్లో తెల్లటిసూటు వేసుకునేవాడు. ఆ సూటు చూస్తుంటే కళ్ళు గుచ్చుకుని నెప్పి పెట్టేటంత తెల్లగా ఉండేది. ఆదివారాలు మాత్రం నీలపుసూటు వేసుకునేవాడు. వెండిపొన్నుగల చక్కటిబెత్తంపట్టుకునేవాడు. ఛస్తే ఎప్పుడూ బోళా బోళీగా మాట్లాడేవాడుకాదు. మామూలుగా చాలా దయగాఉండేవాడు. ఆయనదగ్గిర కూర్చుంటే ఏదో ఒకవిధమైన నిబ్బరంగాఉండేది. ఆయన పొరపాటున నవ్వితే మనకికూడా ప్రాణం తేలికగా ఉండేది. కాని కోపంవచ్చి, మనిషి బిగపట్టి కూర్చుని, లోతైన కళ్ళలోంచి నిప్పురవ్వలుకురిపించటం మొదలుపెట్టినప్పుడు, ముందు ఆయనకందకుండా చెట్టెక్కి కూర్చుని తరవాతనే కోపకారణం తెలుసుకోవాలనిపించేది. "జాగ్రత్తగా ఉండు, తెలిసిందా?" అని ఆయన ఎవ్వర్ని ఎప్పుడూ కోప్పడవలసిన అవసరంరాలేదు. ఎందుకంటే ఆయన చుట్టుపక్కల ఉన్నాడని తెలిస్తే ప్రతివాళ్లూ జాగ్రత్తగానే ఉండేవాళ్ళు.

కర్నల్‌గారూ, ఆయన భార్యా పొద్దున మేడ మీంచి దిగిరాగానే అంతా తమతమ కుర్చీల్లోంచి లేచి భక్తిగా నుంచుని, తలిదండ్రులు కూర్చున్నతరవాతే తాము కూర్చునేవారు. కర్నల్‌గారి పెద్దబ్బాయిపేరు బాబ్. టామ్ తరవాతవాడు. ఇద్దరూ పొడుగ్గా, అందంగా, విశాలమైన రొమ్ము, మంచి ఛాయ, నల్లటిజుట్టు, నల్లటికళ్ళుకలిగి తండ్రిలాగే ఎప్పుడూ తెల్లటిసూట్లువేసుకునేవారు.

మొగవాళ్లిద్దరి తరవాత మిస్‌చార్లటీ. ఆమెకు పాతికేళ్లుంటాయి. ఆమెకూడా పొడుగే. మహా గర్వంగా ఉండేది. కోపంవస్తే తండ్రిమాదిరే అందరినీ హడలగొట్టేది. మనిషి చక్కనిదే.

ఆమెతరవాత మిస్‌సోఫియా. ఆమెకూడా చక్కనిదే. కాని ఆ చక్కదనంలో వేడి, తీవ్రత లేవు.

తియ్యదనం, తెల్లటిగువ్వలాగ సౌమ్యం ఉన్నాయి. ఆమెకు ఇరవైఏళ్లే. ఆమెతరవాత నా స్నేహితుడు బక్.

ఇంట్లో ప్రతివాళ్లకీ ఒక్కొక్క నీగ్రోనౌకరు ఉన్నాడు. బక్‌కికూడా ప్రత్యేకంగా ఒక నీగ్రో ఉన్నాడు. నాకుకూడా ఒక నీగ్రోనిచ్చారు. కాని వాడి కెప్పుడూ సెలవే. ఎందుకంటే నా పనులు ఇంకోళ్ల చేత చేయించుకోవటం నాకెప్పుడూ అలవాటులేదు. అందుకని వాడికి పనులు చెప్పేవాణ్ణికాను. అందరిలోకీ బక్‌నౌకరే కాళ్లరిగేట్టు తిరిగేవాడు.

ప్రస్తుతం గ్రేంజర్‌ఫర్డుల భవనంలోఉన్న కుటుంబసభ్యులు వీళ్లే. ఇదివరకు ఇంకొక నలుగురుండేవాళ్లట. వాళ్లలో ముగ్గురుకొడుకులు. వీళ్లు చంపబడ్డారు. మరొకావిడ ఇదివరకు నేను చెప్పిన పద్యాలు రాసే అమ్మాయి. ఆమె చచ్చిపోయింది.

కర్నల్‌గారికి చాలా పొలాలున్నాయి. ఆయనకి నీగ్రోనౌకర్లే వందమందికిపైగా ఉన్నారు. ఒక్కొక్కసారి పది, పదిహేనుమైళ్లదూరాన్నుంచి ఎవరెవరో గుర్రాలమీద వచ్చేవారు. వారంతా బంధువులేనట. వాళ్లు వచ్చినప్పుడు ఇల్లంతా సందడిగా ఉండేది. నదిఒడ్డున అడవుల్లోకి పోయి పిక్నిక్ చేసుకునేవారు. రాత్రిళ్లు భారీఎత్తున విందులు, నృత్యాలు జరిగేవి. మగవారంతా ఎప్పుడూ తుపాకులు రెడీగా ఉంచుకునేవారు.

చుట్టుపక్కలప్రదేశంలో షెపర్డ్‌సన్ అని ఇంటిపేరుగల మరొకవంశం ఉన్నది. ఆవంశంవాళ్లవి అయిదారు కుటుంబాలున్నాయి. గ్రేంజర్‌ఫర్డులు మోస్తరుగానే షెపర్డ్‌సన్‌లుకూడా గొప్పవంశీకులు, ధనవంతులు, గర్విష్ఠులు.

ఒకరోజున నేనూ, బక్ అడవిలోకి షికారుగా

వెళ్లాం. దూరంనుంచి గుర్రంవస్తున్న చప్పుడైంది. మేము రోడ్డుమీదనే నడుస్తున్నాం. వెంటనే బక్ "పద, చెట్లలోకి పరిగెత్తు'' అని తనుకూడా పరిగెత్త సాగాడు. ఇద్దరం చెట్లెక్కి కూర్చున్నాం. కొంత సేపటికి ఒక అందమైన యువకుడు వచ్చాడు. అతన్ని ఇదివరకే నేను చూసివున్నాను. షెపర్డ్‌సన్ వంశీకుడు. అతనిపేరు హార్నే. బుజానికి తుపాకి తగిలించుకుని సైనికుని వేషంలోఉన్నాడు. అతడు మా సమీపానికి రాగానే బక్ తన తుపాకి గురిపెట్టి పేల్చాడు. గురితప్పి హార్నే నెత్తిమీది టోపీమాత్రం ఎగిరిపోయింది. హార్నే వెంటనే తనతుపాకితీసి మేము దాక్కున్న చోటికి వచ్చాడు. కాని మేము చెట్టుదిగి అప్పటికే కాలికొద్దీ పరిగెత్త సాగాము. చెట్లు దగ్గిరదగ్గిరిగా లేవు. అందుచేత హార్నే ఏక్షణంలో తుపాకి పేలుస్తాడోనని భయపడుతూ నేను మాటిమాటికి వెనక్కిచూస్తూ పరిగెత్తాను. హార్నే ఒకటిరెండుసార్లు బక్‌పైకి తుపాకి గురిపెట్టాడు. కాని ఏమనుకున్నాడో ఏమో పేల్చలేదు. చివరికి మళ్లీవచ్చిన దోవనే వెళ్లిపోయాడు. బహుశా తనటోపీ తెచ్చుకునేందుకే వెళ్లాడనుకున్నాను మేముమాత్రం ఇంటికి చేరుకునేవరకూ ఆగకుండా పరుగెత్తుకువచ్చాము. కర్నల్‌గారు ఈ విషయం విని ఒక్కనిమిషంసేపు ఆనందంతో తన్మయుడైపోయాడు. తరవాత నెమ్మదిగా బక్ నడిగాడు :

"మంచిపనే చేశావు గాని, నాయనా, చెట్టు చాటునుంచి శత్రువుపై గురిచూడవచ్చా? తప్పు కాదూ? నువ్వు రోడ్డుమీదే వుండి అతన్నెందుకు ఎదిరించలేదూ?"

"అదికాదు నాన్నగారూ షెపర్డ్‌సన్‌లు ఎప్పుడూ చాటునించే పోట్లాడతారు. మనం మాటుకు ఎందుకు ఎదటపడాలి?'' అన్నాడు బక్.

పెద్దమ్మాయి మిస్‌చార్లటీ తనతమ్ముడు చెబుతున్నది వింటూ మహారాణిలా గర్వంగా తలఎత్తుకుని వుంది. అన్నలిద్దరూ కనుబొమలు ముడిచి మౌనంగా విన్నారు. మిస్‌సోఫియాముఖంమాత్రం పాలిపోయింది. హార్నేకు దెబ్బతగలలేదని వినగానే మళ్లీ తేరుకుంది.

తరవాత బక్‌ను నేనడిగాను :

"బక్ ! నువ్వతన్ని నిజంగానే చంపుదామనుకున్నావా ?''

"ఓ.''

"ఎందుకు? అతడేంచేశాడు నిన్ను?"

"నన్నేం చెయ్యలేదు."

"మరెందుకు చంపుదామనుకున్నావ్?"

"మాకు వైరముంది."

"వైరం అంటే?"

"వైరంఅంటే తెలియదూ?"

"ఊహూ. నే నెప్పుడూ విననేలేదు."

"నేను చెబుతాను విను. ఒకమనిషికి ఇంకో మనిషిమీద కోపంవచ్చి చంపుతాడు. చంపబడిన మనిషితమ్ముడో, అన్నో వచ్చి చంపినమనిషిని చంపుతాడు. ఉభయపక్షాల అన్నదమ్ములు ఇలా ఒకళ్లనొకళ్లు చంపుకుంటారు. తరవాత ఆ అన్నదమ్ముల బంధువులు, ఆ బంధువులబంధువులు, వాళ్ల బంధువులు చంపుకుంటారు. చివరి కెవరూ మిగలరు. దాంతో వైరం ఆఖరవుతుంది. కాని ఆఖరుకావటానికి చాలాకాలం, చాలాఏళ్లు పడుతుంది."

"మీవైరంచాలా కాలంనించీ వస్తోందా?"

"ఆ. ముప్ఫయిఏళ్లకిందట ప్రారంభమైంది. మొదట చిన్నపేచీ ఏదోవచ్చిందిట. ఆపేచీ కోర్టులో వ్యాజ్యెంగా మారింది. వ్యాజ్యెంలో ఒకడు గెల్చాడు. మరొకడు ఓడిపోయాడు. ఓడిపోయినవాడు గెల్చినవాణ్ణి కాల్చాడు. అందులో తప్పేమీ లేదనుకో. ఓడిపోయినవాడు గెల్చినవాణ్ణి చంపటంలో తప్పేముంది?"

"అసలేమిటి ఆ పేచీ?"

"నాకేం తెలుసు?"

"ముందు చంపిం దెవరు? గ్రేంజర్‌ఫర్డు మనిషా, షెఫర్డ్‌సన్‌మనిషా?"

"అదీ తెలియదు. ఎంతకాలమైందో అది జరిగి."

"ఎవరికీ తెలియదా?"

"మానాన్నకీ, ఇంకాకొందరు ముసలివాళ్లకీ తెలుసనుకుంటాను. కాని వాళ్లకికూడా అసలు పేచీ ఏమిటో తెలియదు."

"ఈఏడు ఎవరన్నా చచ్చిపోయారా?"

"ఆ. మావాడొకడు, వాళ్లవాడొకడు చచ్చిపోయారు. మూడునెలలకింద మాచుట్టాలబ్బాయి బడ్ నది అవతలఒడున ఒక్కడే వెడుతున్నాడు. వాడికి పధ్నాలుగేళ్లే. పైగా వాడిదగ్గర తుపాకికూడా లేదు. ఇంతలో వెనకనించి బాల్డీషెఫర్డ్‌సన్, అంటే, హార్నేతండ్రి వస్తున్నాడు. ఆయనదగ్గర తుపాకి వుంది. మా బడ్ అడవిలోకి పారిపోకుండా రోడ్డుమీదే పరిగెత్తసాగాడు. చాలదూరం పోయాక బడ్ అలిసిపోయాడు. ఆగి వెనకవస్తున్న ముసలివాణ్ణి ఎదురుకున్నాడు. ముసలివాడు ఒక్కదెబ్బతో మా బడ్‌ను చంపేశాడు. కాని వారంరోజులు తిరగకముందే మావాళ్లు బాల్డీషెఫర్డ్‌సన్‌ను చంపేశారు"

"ఆ ముసలాయన పిరికివాడనుకుంటాను."

"పిరికివాడా? ఊహూ. కాదు. షెఫర్డ్‌సన్‌లలో పిరికివాళ్లెవరూ లేరు. మా గ్రేంజర్‌ఫర్డులలో కూడా పిరికివాళ్లు లేరు. ఆ ముసలాడు ఎంతధైర్యంగా పోట్లాడాడో తెలుసా? ఒకరోజు మావాళ్లు ముగ్గురు కలిసి ముసలాడితో దెబ్బలాడారు. ముగ్గుర్నీ అరగంటసేపు ఒక్కడే నిలబెట్టాడు. చివరికి చచ్చిపోయాడనుకో. కాని మావాళ్లిద్దర్ని చంపేశాడు. అతడు పిరికివాడేమిటి? షెఫర్డుసన్‌లలో పిరికివాళ్లు మచ్చుకైనా లేరు."

ఆదివారంనాడు అందరం చర్చికి పోయాము. గుర్రాలెక్కి, తుపాకులు రెడీగాపట్టుకుని మరీ వెళ్లాము. చర్చిలో మతగురువుచెప్పే ఉపన్యాసం వింటూకూడా తుపాకులు వదలలేదు. షెఫర్డ్‌సన్‌లు కూడా తుపాకులతోనే వచ్చారు. మతగురువు సత్యము, అహింస మొదలైనవాటిమీద చాలసేపు తోమితోమి వదిలిపెట్టాడు. కాని అంతా ఆ ఉపన్యాసాన్ని మెచ్చుకున్నారు. ఇంటికి తిరిగిపోతూకూడా దాన్నిగురించే చాలసేపు మాట్లాడుకున్నారు. అంత ఊకదంపుడుఆదివారం మళ్ళీ నాజన్మలో ఎప్పుడూ తగల్లేదు.

మధ్యాహ్నం భోజనాలైనాక అంతా కునికిపాట్లుపడుతున్నారు. నాకు ఒంటరిగా ఏమీ తోచలేదు. బక్, తనకుక్కతో తోటలో పడుకుని నిద్రపోయాడు. నేను నాగదికి వెళ్లాను. నాగదిపక్కనే మిస్‌సోఫియా గది ఉన్నది. ఆమె నన్ను మెల్లిగా పిలిచింది. "నేనంటే నీకిష్టం కదూ?" అని అడిగింది. అవునన్నాను. "ఒకపనిచెబుతా చేస్తావా?" అని అడిగింది. చేస్తానన్నాను. "ఎవరితోనన్నా చెబుతావా?"

అంది. చెప్పనన్నాను. చర్చిలో పొద్దున తనబైబిల్ పుస్తకం మరిచిపోయివచ్చాననీ, అది అర్జంటుగా తెచ్చిపెట్టాలనీ కోరింది. అలాగేనని బయల్దేరివెళ్లాను. చర్చిలో ఎవరూలేరు—రెండుమూడు పిల్లులుతప్ప.

మిస్‌సోఫియా బైబిల్‌కోసం ఎందుకంత తహతహలాడుతోందా, అందులో అంత కొంప మునిగిపోయేది ఏముందా అని నాకనుమానం కలిగింది. బైబిల్ ఆమెచెప్పినచోట నేఉన్నది. తీసివిదిలించాను. ఒకచిన్న కాగితం బయటపడింది. దానిమీద "రెండున్నరకి" అని ఉంది. పుస్తకం ఇంకా విదిలించాను. ఇంకేమీ కన బడలేదు. అది తీసుకుని ఇంటికి వచ్చాను. మిస్ సోఫియా నాకోసం ఎదురుచూస్తోంది. ఆమె నన్ను తన గదిలోకి లాక్కెళ్లి తలుపులువేసి పుస్తకం తీసుకుంది. పుస్తకం పేజీలన్నీ తిప్పి కాగితం తీసుకుని, చదివింది. ఆకాగితం గుండెల కద్దుకుంది. తరవాత నన్ను కావిలించుకుంది. నా అంత మంచి అబ్బాయి ప్రపంచంలో లేడంది. చర్చికి వెళ్ళి బైబిల్ తెచ్చిన సంగతి ఎవరితోనూ చెప్పవద్దంది. ఒకనిమిషంసేపు ఆమె ముఖం ఎర్రపడింది. కళ్లు ఒక వెలుగు వెలిగాయి. ఆ సమయంలో ఆమె ఇంకా అందంగా కనబడింది. ఆమె ఉత్సాహం తగ్గాక అడిగాను ఆకాగితం ఏమిటని. "నువ్వు చదివావా ?" అని అడిగింది. లేదన్నాను. "అసలు చదవగలవా ?" అని అడిగింది. చాతకాదన్నాను. "ఆ కాగితం ఏమీ లేదు. పేజీ గుర్తుకోసం పెట్టిన కాగితం" అన్నది. ఇక పోయి ఆడుకోమని పంపించేసింది.

మిస్ సోఫియాప్రవర్తనను గూర్చే ఆలోచిస్తూ నదిఒడ్డుకి వెళ్లాను. నా నీగ్రోనౌకరు వెనకాలే వస్తున్నాడు. కొంత దూరం పోయాక వాడు నన్ను కలుసుకున్నాడు. ఎందు కొచ్చావని అడిగాను.

"జార్జిగారూ ! మీరొక్కసారి మన బోదెలోకి వస్తే తమాషా చూపిస్తాను."

"ఏమి టా తమాషా ?"

"మంచి మంచి పళ్లున్నాయండి."

ఈ నీగ్రో నిన్న కూడా ఇలాగే బోదెలోకి రమ్మని అడిగాడు. కాని నేను వెళ్ళలేదు. చూద్దాము సంగ తేమిటోనని వాడివెంట వెళ్లాను. అలా ఒక అరమైలు పోయాము. ద్రాక్షలతలు, గుమ్మడి తీగలు అల్లిబిల్లిగా అల్లుకున్న ఒక బోదెవద్దకు తీసు కొచ్చాడు. ఆ బోదెవెంట కొంత దూరం నన్ను వెళ్లమన్నాడు. వెడితే తను చెప్పిన తమాషా కని పిస్తుందన్నాడు. నేను బోదెపైకి నడిచాను. నీగ్రో వెనక్కి వెళ్ళిపోయాడు. నేను ఇంకా ముందుకు పోయాను. ఒకచోట లతలు, పొదలు బాగా అల్లుకుని వున్న గుబురులో ఒక మనిషి పడుకుని నిద్రపోతున్నాడు. దగ్గిరికి వెళ్ళి పరకాయించి చూస్తే జిమ్!

(ఇంకావుంది)

# సోమవారం ఉదయం

★

కుమారి బి. ప్రేమలీల

"ఏం రా శ్యామూ! ఆరున్నర కావొచ్చింది. ఇంకా లేవ్వేం? ఈవేళ సోమవారం. స్కూలుంది గాదూ?" అని అమ్మ ఒక్క కేకేసే సరికి శ్యాము ఉలుక్కుపడి కళ్లు నులుముకుంటూ లేచాడు. లేచీ లేవడంతోనే కాలెండరు మీద పడిందాతని దృష్టి. సోమవారం! స్కూలు... బట్టతల మేష్టారు- దెబ్బలూ, మళ్లా. శనివారం, ఆదివారం హాయిగా గడిపిం తరువాత ఈ సోమవారం రాగానే శ్యాముకి దుఃఖం, కోపంకూడా వచ్చింది. ఛీ వెధవ సోమవారం! అనుకుంటూ ఆలస్యంగా లేచినందుకు నాన్న గారేమంటారో అనే భయంతో చెంగున మంచంమీద నుండి గెంతి దొడ్లోకి పరుగు దీశాడు. ముఖం కడుక్కొనే సమయంలో శ్యాముకి సోమవారం ఉదయానికని మాస్టారిచ్చిన హోంవర్కు జ్ఞాపకమొచ్చింది. అప్పుడే ఏడు గంటలు కావొస్తోంది. స్నానం చేస్తూ కూచుంటే ఆలస్యమవుతుందని ఆవేళకి అమ్మమ్మ కళ్లపడకుండా నెమ్మదిగా లోపలికి జారాలని ఆలోచించి దొంగ చాటుగ లోపలికి పారిపోయాడు. 'అరేయి! శ్యామూ! స్నానం చేయకుండా పోతున్నావేంరా'! అని అమ్మమ్మ ఎదురుగా వచ్చి బాత్ రూంలోకి లాక్కెళ్ళింది శ్యామును. అమ్మమ్మని వెయ్యిసార్లు తిట్టుకుంటూ స్నానం ముగించి వంటింట్లోకి పరుగుదీశాడు. కాఫీ తాగుతున్నాడే గాని శ్యాము దృష్టంతా నాన్నగారి ఆఫీసురూం వైపుంది; ఆఫీసు కెళ్లారో, లేదో నని. తనని హోంవర్కు చేసికోనీయకుండా ఎక్కడ ఇంగ్లీషు




పాఠాలు చెబుతూ కూర్చుంటారో అనే భయంతో జోళ్ల శబ్దం కోసం చెవులు నిక్కబెట్టుకు వింటున్నాడు. ఆసమయంలో 'శ్యామూ!! అని నాన్నగారి కేక వినగానే శ్యాము గుండెలు చల్లబడ్డాయి. మెల్లమెల్లగా ఆఫీసు రూంలోకి వెళ్లాడు. నాన్న గారెవరితోనో మాట్లాడు

తున్నారు. శ్యాము గడియారం కేసి చూస్తూ నుంచున్నాడు. 7 - 15 అయింది. నాన్నగారు శ్యాముని ఆవచ్చిన స్నేహితునికి చూపించి "ఇతుడేనండి రెండోవాడు. సెకండు ఫారం చదువుతున్నాడని" శ్యాము వంక తిరిగి "వెళ్ళరా. పోయి చదువుకో!' అన్నారు. శ్యాము 'అమ్మయ్య!' అనుకొని ఒక్క పరుగున తనగదిలో చొరబడి బల్ల ముందు కూర్చున్నాడు. పుస్తకం తీయగానే ఆ వేళకి చేయాల్సిన హోంవర్కు కనిపించింది ఎదురుగా. ఇంగ్లీషు డిక్టేషను, రెండు చూచి వ్రాతలు, ఆరు లెక్కలు. ఒక తెలుగు పద్యం కంఠతా-ఇంగ్లీషు పాఠం చదవి అర్థాలు వ్రాయడం. శ్యాము గడియారం కేసి చూశాడు. ఇంక రెండు గంటలే పైముంది. తొందరగా పుస్తకాలు తీసి మొదలెట్టాడు, అతనికి సోమవారంమీద మహా చెడ్డ కోపం వచ్చింది. 'ఎంచక్కా-హాయిగా శని ఆదివారాలు దేవుడు పుట్టిస్తే ఆసైతానుగాడు దేవుడిమీద కోపంతో ఈ సోమవారాన్ని పుట్టించి ఉండాలి. మా పాలిటికి దయ్యంలా' అని సోమవారం ఉదయాన్ని తిట్టుకుంటూ స్పీడ్‌గా హోంవర్కు చేయసాగాడు సోమరి శ్యాము. ★





"మీ నాన్నగారు నడుపుతుండగా నిన్ను మాట్లాడవద్దని ఎన్నిసార్లు నీతో చెప్పాను?"



# స్వప్న లోకంలో ఆలిస్

వెళ్ళి వెళ్ళి ఆలిస్ దట్టమైన అడవి ప్రవేశించింది. దారీ తెన్నూ తెలియక ఒక చెట్టుమొదట చేరింది. ఒంటరితనం భరించలేకపోయింది. బోలెడు పూలమొక్కలు, పువ్వులమీద ఎగురుతున్న బుల్లిబుల్లి రెక్కల పురుగులూ కనపడ్డాయి. వాటితో స్నేహం చేసుకోవాలనిపించింది. జేబులో ముక్క తీసి కొరికింది. ఆలిస్ వేలెడంతయిపోయింది. ఈమాటు ఆకులూ పువ్వులూ పురుగులూ పెద్దవిగా కనపడ్డాయి. రెక్కలపురుగులు ఆలిస్‌ని చూసి ఏదో కొత్తపురుగొచ్చిందనుకున్నాయి. టపటప రెక్కలతో కొట్టడం ప్రారంభించాయి. గాలికి ఆడుతున్న ఆకుల్ని తప్పించుకుంటూ ఆలిస్ చక్కని పువ్వులున్నచోట చేరింది. అప్పుడే పువ్వులు వాటిలో అవి వాదించుకొంటున్నాయి, ఏ పువ్వు అందమైనదీ అని. ఆలిస్‌ని చూసి తీర్పు చెప్పమన్నాయి. ఎవరికీ కోపం తెప్పించడం ఇష్టం లేక అన్ని పువ్వులూ అందంగానే ఉన్నాయంది ఆలిస్. అక్కడతో పువ్వులికి కోపంవచ్చి ఆలిస్‌ని పూలరేకలతో విసిరికొట్టాయి. ఆలిస్ పువ్వుల్ని విదిల్చుకుంటూ మళ్ళీ చెట్టుదగ్గిర చేరింది. చెషైర్ పిల్లి చెట్టుమీద కనపడింది. మొదట తను చూసిన పూలతోటకి దారి చూపించమని అడిగింది. "నీ యెదురుగానే ఉంది దారి. సరిగ్గా చూడు" అంది చెషైర్ పిల్లి. ఆలిస్ చూసింది. చెట్టుతొర్రలోనించి చూసేసరికి పూలతోట, ఒక రాజభవనం కనపడ్డాయి. ఆలిస్ ఆదారిని బయలుదేరింది.



రెక్కలపురుగులు ఆలిస్‌ని చూసి, ఏదో కొత్తపురుగొచ్చిందనుకున్నాయి.



పువ్వులికి కోపంవచ్చి ఆలిస్‌ని పూలరేకలతో విసిరికొట్టాయి.



చెట్టుతొర్రలో చూసేసరికి పూలతోటకి దారి కనపడింది.

# గడియారం చెప్పిన కథ



సుందరం మంచివాడే; కానీ– కొంచెం బద్ధకస్తుడు. తెలివిగలవాడే; కానీ మతిమరుపు. బుద్ధిమంతుడే; కానీ–క్లాసులో అల్లరి చేస్తాడు. అసలు అతనికి ఏపనీ చేయకుండా కమ్మగా నిద్రపోవటం అంటే బలే యిష్టం. స్కూలుకు పోవటం అంటే యిష్టంలేక కాలేదు కానీ, టైంకు అక్కడ వుండాలంటే మాత్రం మహా చిరాకు పడ్తాడు. స్కూలుకు అంటే లేటుగా వెళ్లి కాసేపు బెంచీ అయినా ఎక్క, యిక ఆరోజుకు ఆపీడ వదిలించుకొంటాడు కానీ యింటి దగ్గర వాళ్ళనాన్న, వాళ్ళ అక్కయ్య ప్రతి పనీ టైంప్రకారం జరుగాలని యితని ప్రాణాన్ని మహా వేధించుకు తింటారు. ప్రొద్దున ఆరుకొట్టే సరికి, చచ్చి గీపెట్టేది–ప్రక్కమీద నుంచీ లేచి తీరవలసిందే. బలవంతంగా ప్రక్కను వదిలి లేచి వస్తూ ఆప్రక్కకేసి ఓసారి వెనక్కు తిరిగి చూస్తే, ఆప్రక్క ఏమిటో పాపం–దిగులుగా తనవేపే చూస్తున్నట్టు తోచేది సుందరానికి. 7 కొట్టేలోగా స్నానం చేసెయ్యాలి. చలి అంతగా బొమికలు కొరికేస్తుంటే ఎందుకు వచ్చిన స్నానంయిది! 9-30 కు పుస్తకాలు చేతపట్టి స్కూలుకు బయలుదేర వ ల సిం దే. ఇంట్లో నుంచీ బయటపడిన తరువాత యిక అతను కసికొద్దీ ఎంత ఆలస్యం చేయగలడో అంత ఆ ల స్య మూ చేసి మరీ స్కూలు చేరేవాడు. దారి పొడుగునా గారడీవాళ్లు, కోతుల ఆటలు, బిల్లంగోడీలు యిన్ని వుంటే వీటనన్నిటినీ వదిలిపెట్టి వుక్కిరి బిక్కిరి చేసే ఆస్కూలు గదిలోకి పోకపోతే ఏమౌతుందో అతనికి ఎంత ఆలోచించినా అర్థమయ్యేది కాదు.

ఆరోజుకూడా అతని అలవాటు ప్రకారం స్కూలు వదలి పట్టాక గొందులన్నీ తిరిగి యింటికి 7 గంటలకల్లా చేరుకొన్నాడు. తనకు మటుకు తను పెంద్రాడే కొంపకు చేరాననుకొన్నాడు. కానీ – పెద్దవాళ్లు తనలాగా ఆలోచించ లేరు కదా! నాన్న అప్పుడే నరసింహావ తారం దాల్చి వీధి వాకిట్లో ఎదురయ్యాడు. తానేదో పరాకుగా తలవంచుకొని గుమ్మంమెట్లు ఎక్కుతుంటే అరుగు మీదనే కాచుకు కూర్చొన్న నాన్న చెవు లంకించుకొని, బర బరా గదిలోకి యీడ్చుకుపోయి గోడ గడియారం ఎదుట నిలబెట్టాడు.

"ఏం! టైం ఎంతైందో కనుపిస్తోందా? వళ్లు ఏమైనా దగ్గర వున్నదా? సాయంకాలం 5 గంటలకనగా స్కూలు వదలి పెట్టితే యిప్పుడా నువ్వు యింటికి చేరేది?"

అక్కయ్య అందుకొంది "వాడు రోజూ యింతే నాన్నా! ఏ పనీ టైముకు చేయడు; టైముకు స్కూలుకు వెళ్ళడు; టైముకు యింటికి రాడు. ఏవేళకు ఆపని చేయటం నేర్చుకోలేని యీ వెధవ ఎందుకు పనికి వస్తాడో అర్థం కాకుండా వున్నది."

'వెధవ' ట వెధవ! సుందరానికి వళ్లుమండి పోయింది. అసలే మంట మండిపోతున్న వంటిమీద నాన్న వేసిన చురుకులు మరీ చిచ్చుపెట్టాయి. సుందరానికి వళ్లు తెలియని కోపం వచ్చింది. ఆ కోపాన్నంతా బయటకు వెళ్లగక్కు కొందామంటే మాటలు

దొరకలేదు: వెధవది — వచ్చిన కోపాన్ని వ్యక్తం చేయటానికి మాటలే దొరక్కపోతే ఎల్లాగు! కళ్ల వెంట నీళ్లుమాత్రం బొటబొట ఏకధారగా కారటం మొదలెట్టింది. వస్తున్న ఏడుపును పౌరుషం కొద్దీ పైకి వినిపించ కుండా చేయాలని అతడు చేసిన ప్రయత్నం అంతా మూతి ముందుకు రావటంతోనే ఆగిపోయింది. పెద్ద గుక్కపట్టి ఏడ్చేయాలన్నంత కసి వచ్చేసింది. అప్పటికి నాన్న చేతులో బెత్తం క్రింద పారేసి "ఛో! యికనైనా మంచి అలవాట్లు చేసుకో! ఏడు" అంటూ విదలించాడు.

సందు దొరికింది కదా అని సుందరం కాళ్లు తపతప నేలకేసి కొట్టుకొంటూ పోయి ఆమూల గదిలో పరుపు చుట్టలను ఆనుకొని పడుకొని ఏడవ గలిగినంత సేపు ఏడ్చాడు. ఏడ్చి యిక ప్రయోజనం లేదని తోచాక ఏడ్వటం మానేశాడు కానీ వుండి వుండి ఎక్కిళ్లు రావటం మొదలైంది. ఒక్కొక్క సారి ఎక్కిళ్లు వచ్చినప్పుడల్లా దాని వెంటనే బిగ్గరగా ఏడుపుకూడా పైకివచ్చేది. తన ఏడుపు వింటే తనకే సిగ్గుఅయింది. కాకపోయినా అక్కయ్య మరీనూ — యింత ఏడ్చి యిది అవుతుంటే కాసిని మంచి నీళ్లు అయినా తెచ్చి పెట్టకూడదేం! పోనీ తనుపోయి అడిగితేనో — ఛస్తే అడగడు! తనమీద ఎంత లావు కొండేలు చెప్పింది నాన్నతో! దప్పికతో చస్తేచస్తాడు! ఏం! చస్తేనే పోయి. ఈటైము, యీ గడియారల గొడవ ఏమీ లేకుండా ఎంత హాయిగా వుంటుంది. అలానే ఆ గడియారాలు లేని ఆస్వప్న లోకాన్ని గురించి ఆలోచిస్తూ అలానే కునుకు తీశాడు.

ప్రక్కగదిలో నుంచి గడియారం టిక్కు టిక్కు వినిపిస్తూనే వున్నది.

నిద్రపోతున్న తన వెనుకగా ఎవరో కదిలిన అలికిడి అయింది.

"ఏం! నాయనా! ఏడుస్తున్నావేం" అని పలుకరించింది ఓ ఆకారం. సుందరం తుళ్లిపడ్డాడు. ఎవరా అని చూచాడు. మనిషి ఎవరూ కనుపించలేదు. గోడ గడియారం ఆకారం మాత్రం చీకట్లో కనుపిస్తున్నది.

"నేనే. గంటల గడియారాన్ని. ఈ యింట్లో మూడుతరాల మనుషుంను ఎరిగివున్నాను. మీ తాత మీతండ్రి వీరంతా అనుభవించిన కష్టసుఖాలను నాకళ్ళతో నేనూ చూశాను. ఏగంటకు ఆపని చేయలేదని మీ నాన్న పసివాడివి నిన్ను కొట్టుతుంటే నాకూ గుండె బిక్కబట్టేది. ఏడవకు బాబూ!" అని ఓదార్చింది.

సుందరానికి బలే వళ్లు మండుకు వచ్చింది. అసలు యిందాకటి నుంచీ సుందరానికి గడియారం మీద కోపంగా వున్నది. ఈ గడియారం అంటూ ఒకటి వుండబట్టే కదా నాన్న, అక్కయిద్దరూ టైము పేరు చెప్పి తనపై యింత జులుం చేస్తున్నారు. ఈ గడియారం లేకుండా పోవాలని కదా తానింత వరకూ కోరుకొంటున్నది. ఏమైతే అయిందని ఆ గడయారాన్ని పట్టుకొని మొఖంమీదే అనేశాడు: "నువ్వునాతో మాట్లాడక్కరలేదు. నీ మూలంగానే నాకిన్ని కష్టాలు వచ్చాయ్. ఛో అవతలకు" (ఇందాక నాన్న తనమీద అరచిన దానికంటే బిగ్గరగానే తాను 'ఛో' అన్నందుకు సంతోషించాడు.)

"అలాకాదు సుందరం! నువ్వైతే యీవేళ అవతలకు పొమ్మని తేలికగా అనగలుగుతున్నావు కానీ నన్ను అసలు సృష్టించటం కోసం నీ తాత ముత్తాలు ఎంత కష్టపడ్డారో, నేనులేక ఎంత ఆవేదన పడ్డారో నీకు తెలియదు."

"అబ్బోసి! నువ్వు లేకపోతే ఎవ్వరూ కష్టపడరు; అంటే ప-డ-రు."

"అలాగేం! నేను నాజాతివాళ్లు అందరం ఒక్క క్షణం పనిచేయటం మానివేశామంటే, మీ మనుష్యులంతా తన్నుకు చస్తారు. రైళ్లు ఒకదానితో ఒకటి గుద్దుకు ముక్కలు ముక్కలు అయిపోతాయి. ఫ్యాక్టరీలు పనిచేయవు. ముఖ్యంగా మీ లెక్కల మాష్టారు వున్నాడే - ఆయన ఎన్ని రోజులు సంవత్సరాలు గడిచిపోయినా అంతు లేని ఆ లెక్కలు అలా చెప్పుకు పోతూనే వుంటాడు. అప్పుడు చూసుకో — మీ పిల్లలందరిపని ఏమై పోతుందో!"

"మరేం భయం లేదు. ఆకాశంలో సూర్యుడు వున్నాడు. చంద్రుడు వున్నాడు. ఇంకా బోలెడన్ని నక్షత్రాలు వున్నాయి. మీరంతా సమ్మెచేసినా పాపం — అవి మాత్రం సమ్మె చెయ్యలేవు కదా! అవి వున్నంత వరకు మీ వెధవ ముఖాలు మాకు కనుపించక పోయినా మరేమీ ముప్పులేదు."

చెల్లాయికి ఉత్తరాలు: 11

# ★ పరిపూర్ణ వ్యక్తి ★

చెల్లాయీ ! నీకు చిన్నన్నయ్య వ్రాసినా, నేను వ్రాసినా ఏదో ఒక్క విషయంలో గొప్పవాడైన వ్యక్తినిగురించే యింతవరకు వ్రాస్తూ వచ్చాము. ఇన్ని వుత్తరాలూ వ్రాశాక అన్ని రంగాలలోనూ ఖ్యాతి నార్జించగల శక్తి ఏ మానవుడికైనా వుంటుందా అనే అనుమానం నీలో కలగటం, నువ్వు ఆవిధమైన ప్రశ్నవేస్తూ వుత్తరం వ్రాయటం, చాలా మెచ్చుకోదగిన విషయాలు.

అనేక రంగాలలో కృషిచేసి అన్నిటిలోనూ ఖ్యాతి నార్జించిన మహానుభావులు లేకపోలేదు. అటువంటి వారిలో పేర్కొనదగిన వ్యక్తి లియొనార్డో డా విన్సీ. ఈయనను గురించి వ్రాసే ముందు ఒక్క విషయం నీ మనసునకు నాటేలా చెప్పాలని వున్నది. అనాదినుంచీ మానవకోటి కాన గాని ఒక లక్ష్యం కోసం ప్రయత్నిస్తూనే వున్నది. మానవత్వాన్ని పరిపూర్ణం చేసుకోవాలని సదా సదమద మౌతున్నది. పరిపూర్ణ మానవత్వం అంటే ఏమిటి? శరీరంలో ప్రతి భాగాన్ని చక్కగా పోషించుకొని, మనిషి అందంగా తయారైనంత మాత్రాన ఆవ్యక్తిని పరిపూర్ణ వ్యక్తి అనలేము కదా! అలాగే శరీరాన్ని సుష్కింప చేసుకొని మేధస్సును తెగ పెంచుకొన్న వ్యక్తిని కూడా పరిపూర్ణ వ్యక్తి అనటానికి వీలులేదు. తెలివితేటలను అలవరచుకోవటంలో కూడా కొందరు కేవలమూ విమర్శించటంలో ప్రత్యేకతను ప్రదర్శిస్తారు. మరి కొందరు విమర్శాజ్ఞానంతో ప్రమేయం లేకుండా నిర్మాణాత్మకమైన కృషినే సదా కొనసాగిస్తుంటారు. కాబట్టి ఏవ్యక్తి అయినా ఏదోఒక్క విషయంలోనే కృషిచేసి, అందులోనే ప్రత్యేకతను సాధిస్తాడు. మానవుల ఆయుస్సు అల్పంకదా! ఈ అల్ప వ్యవధిలో అన్ని శాస్త్రాలతోనూ పరిచయం చేసుకోవటానికే శక్తి చాలదు. వ్యవధి అల్పమే అయినా ఆసక్తి అంటూ ఒకటివుంటే మానవుడు సాధించలేనిది ఏమీ లేదని లియనార్డో డా విన్సీ వంటివారి జీవిత గాథలు ఋజువు చేస్తాయి.

లియనార్డో 1452 ఏప్రిల్ 16 న ఇటలీదేశంలో విన్సీ అనే వూరిలో పుట్టాడు. ఈ జాబు నీకు చేరే 16 ఏప్రిల్ (1952) నాటికి ఆతడు పుట్టి సరిగ్గా 500 సంవత్సరాలు గడిచాయన్నమాట. ఈనెల పొడుగునా యూరప్ యూరప్ అంతటా యీయన జన్మదినోత్సవాలు ఎంతో శ్రద్ధ భక్తులతో జరుపు కొంటున్నారు. ఈ ఒక్క విషయాన్ని బట్టే లియనార్డో ఎంత గొప్పవాడో నీవు కొంతవరకు వూహించుకో వచ్చు.

విన్సీలో కాటరీనా అనే ఆమెకు సెర్ పియరో ఎంటానియో డ విన్సీ అనే ప్లీడరుకు యీతను పుట్టాడు. లియనార్డో చిన్నతనంలో స్కూలుకుపోయి అక్కడ లెక్కల మేష్టరును గణితశాస్త్రాన్ని గురించి ఎన్నో చిక్కుప్రశ్నలు వేసి చిత్తర పోగొట్టేవాడట. అప్పుడే సంగీతంలో కృషికూడా చేయ నారంభించాడు. అసలు మంచి స్ఫురద్రూపి ఏమో. ఆతడు జంత్రం మీద అమరగానం వాయించే వాడట. ఇన్ని కళా

---

“తొందర పడుతున్నావు సుందరం! మీ ముత్తాతలకు యీ మాత్రం ఆలోచన లేకనేనా అన్ని వందల సంవత్సరాలు కష్టపడి రెక్కలు ముక్కలు చేసుకొని మమ్మల్ని సృష్టించింది! ఆమాదిరి రోజులూ గడువక పోలేదు. ఆమాదిరిగా రోజులు గడువకనూ పోవు. అయినా మావల్ల కొన్ని ప్రత్యేక లాభాలు, కొన్ని సులువులు వున్నాయి కనుకనే మమ్మల్ని మనుష్యులు యింత కష్టపడి కనిపెట్టారు.

“గొప్పగా సమర్థించుకొంటున్నావే!”

“అదికాదు. నాపుట్టుపూర్వోత్తరాలన్నీ చెప్తాను. ఓపికగా వింటావా?”

“ఎంతసేపు పట్టుతుందేమిటి?”

“చూశావా! ఏదైనా పనిచేయవలసి వచ్చేసరికి ఎంతసేపు పట్టుతుందని ఆలోచించడం ఆరోజూ, యీరోజూ అందరికీ మామూలే. ‘ఎంతసేపు’ అన్నది నిర్ణయించటానికే మేం కావలసివచ్చింది. ఇక విను మా కథ.” (ఇంకావుంది)

వ్యాసంగాలు కుదుర్చుకొన్నా యీతనికి బొమ్మలు వ్రాయటంలోనూ, మట్టిబొమ్మలు చేయటంలోనూ ప్రత్యేకమైన అభిమానం వుండేదట. ఇది గమనించిన ఆతని తండ్రి యితనిని నేర్పరులైన చిత్రకారులవద్ద చేర్పించాడు. అనతికాలంలో యితడు బొమ్మలు వేయటం, రంగులు పూయటం నేర్చుకొన్నాడు. లియనార్డోకు విశేషమైన వైజ్ఞానిక పిపాస వుండేది. ఎక్కడో తయారై వచ్చిన రంగులను ఏవో పెద్దలు చెప్పిన సూత్రాలను పాటిస్తూ వుపయోగించటంతో అతనుతృప్తి పడలేదు. రంగుల తత్వాన్ని గూర్చి నిశితంగా విమర్శించుకొనేవాడు. అందమైన బొమ్మలు గీయగలగటానికి మానవ శరీర నిర్మాణం తెలియాలి కదా! అందుచేత యీతడు వైద్యుల మాదిరిగా ఒక్క మానవ శరీరాలనే కాక జంతువులు, పక్షుల శరీర నిర్మాణ రీతులను గురించికూడా కొన్ని పరిశోధనలు జరిపాడు. వృక్షశాస్త్రంలో లోతులు తీశాడు. ఆయా శాస్త్రాలలలో యీతడు ఎంతటి విజ్ఞానాన్ని సంపాదించిందీ, అప్పటికి ఆ శాస్త్రాలలో తెలియకుండావున్న ఎన్ని రహస్యాలను యీయన కనిపెట్టిందీ తెలుసుకోవటానికి యీ నాటికీ ఆధారాలు వున్నాయి ఆయన తను జరిపిన ప్రతి పరిశోధన తాలుకు అంశాలను 'నోట్సు' రూపంలో వ్రాసుకొనేవాడు. 40 ఏండ్లపాటు యీ మాదిరి నోట్సు తయారు చేశాడు. (అందుకే ప్రతి విద్యార్థీ, ప్రతివ్యక్తీ నోట్సు వ్రాసుకొనే అలవాటు చేసుకోవాలని నీతో నేను అన్నిసార్లు అన్నాను.)

1482 లో లియనార్డో మిలాన్ మహానగరానికి ప్రయాణమై వెళ్లుతూ వెండితో చేసిన వీణె ఒకటి మాత్రం వెంట తీసుకు వెళ్లాడట. గుర్రం తలకాయను పోలిన ఆకారంలో యీ వీణెను తయారు చేశాడట. అప్పుడు మిలాన్‌ను పరిపాలిస్తున్నవారు స్ఫోర్జా వంశీకులు. రాజు లుడోవికోకు లియనార్డో వుద్యోగం కోసం దరఖాస్తు పెట్టుకొంటూ అందులో సైనిక శాస్త్రానికి, యుద్ధ వ్యూహాలకు సంబంధించి తాను నిర్ణయించిన తొమ్మిది పద్ధతులను పేర్కొన్నాడు. యుద్ధ సమయంలో ఆవిధమైన సేవ చేయటమే కాక, శాంతి సమయంలో తాను భవన నిర్మాణాలలోను, శిల్ప, చిత్రలేఖనాదులలోనూ ప్రతిభ చూపగలనని కూడా చెప్పుకొన్నాడు. ఈమాటలన్నీ ఆతడు వూరికే డంబానికి చెప్పుకో లేదు. లుడోవికో కొలువులోవున్న 17 ఏండ్లలోనూ యితడు బహుముఖాల తన ప్రతిభను కనుపరిచాడు. ఆతని కొలువులో వున్నంతవరకు ఎప్పుడు ఏ ఉత్సవం జరిగినా, వాటి తాలూకు అలంకారాలు, ఏర్పాట్లు అన్నీ యితడే చేసేవాడు. ఇలా వుండగా 1485లో మిలాన్ నగరంలో ప్లేగు ముమ్మరంగా వచ్చింది. పట్టణంలో చాలాభాగం శిథిలమైంది. తదనంతరం పట్టణం సరిక్రొత్తగా నిర్మించవలసి వచ్చింది. లియనార్డో తన బుద్ధి బలాన్ని వినియోగించి ఆ పట్టణాన్ని అందమైన పట్టణంగా నిర్మింపచేయటానికి ఎంతో సహాయ పడ్డాడు. ఇలా చేస్తూనే గణిత శాస్త్రం, ఖగోళ శాస్త్రం, సంగీతం మొదలైన అనేక శాస్త్రాలలో తన పరిశోధనలు కొనసాగించాడు. ఇలా వుండగా లుడోవికో ప్రభువు కీర్తిశేషుడైన తన తండ్రి గుర్రంమీద స్వారీ చేస్తున్నట్లుగా వుండే పెద్ద విగ్రహమొకటి తయారు చేయమని లియనార్డోను ఆజ్ఞాపించాడు. కొన్ని ఏండ్లపాటు యీతడు కష్టపడి, 26 అడుగుల ఎత్తు వున్న గుర్రం బొమ్మను మాత్రం బంక మట్టితో తయారు చేశాడు. ఈలోగా ఫ్రెంచి రాజులు మిలాన్‌పై దండెత్తి వచ్చారు. 1499 లో మిలాన్ వీధులలో జరిగిన పోరాటం సందర్భంలో ఫ్రెంచి సైనికులు యింత చక్కని గుర్రపు బొమ్మను ధ్వంసం చేశారు.

1494లో లియనార్డో లొంబార్డో నదీ మైదాన మంతటికీ నీటి వస

రులు కల్పించేందుకు కొన్ని ప్లానులు తయారు చేశాడు. అదే సమయంలో తుపానులు ఎందుకు వస్తాయి, మెరుపులు ఎలా పుట్టుతాయి అనే వైజ్ఞానిక విషయాలను గురించి కొన్ని పరిశోధనలుజరిపాడు. ఇతడు రచించిన బొమ్మలలోకల్లా గొప్పదిగా చెప్ప బడుతున్న "లాస్ట్ సప్పర్" (చిట్టచివరి విందు భోజనం) అనే బొమ్మను లియనార్డో 1494 లోనే ప్రారంభించాడు. ఈచిత్రంలో లియనార్డో, ఏసుక్రీస్తు ప్రవక్త జీవిత గాథకు సంబంధించిన ఒక ఘట్టాన్ని చిత్రించాడు. ఏసుక్రీస్తు బోధనలను ఏవగించుకొన్న రోమనులు ఆయనను కడతేర్చాలని కాచుకొని వున్నారు. ఏసు ప్రభువుకు ముఖ్య అనుచరులు పదముగ్గురు వుంటే అందులో ఒకడు స్వామిద్రోహం తలపెట్టి ఏసు వునికిని గూర్చిన అచూకీ రోమనులకు అందించాడు. తన అనుచరుడే యింతటి ద్రోహం చేశాడని తెలియక పోయినప్పటికీ తాము 13 గురూ కలసి చేసిన చిట్టచివరి భోజనం సందర్భంలో ఏసు ప్రభువు విరక్తి భావంతో "మీలోనే ఎవరో ఒకరు నన్ను శత్రువులకు అప్పగించ వచ్చుకదా!" అని మాత్రం అన్నాడు. అదివిన్న మిగిలిన అందరూ ఆశ్చర్య చకితులై "అంతటి" ద్రోహులమా మేము, ప్రభూ" అని ఏసును అడిగారు. లియనార్డో సరిగా యీ ఘట్టాన్నే చిత్రించాడు. ఆ పదముగ్గురి ముఖాల లోనూ వ్యక్తమౌతున్న ఆందోళన, గౌరవ భావాలను చాలా చక్కగా చిత్రించాడు. ఏసుప్రభువు ముఖ వైఖరిలో అదొకరకమైన నైరాశ్యము, తన జీవితంపైనే తనకు సహజంగా వున్న నిర్లక్ష్యత చక్కగా వ్యక్తంచేశాడు లియనార్డో. ఈచిత్రాన్ని గురించి చాలా చక్కని కథ ఒకటి ప్రచారంలో వున్నది. (మన దేశంలో అంత ఎక్కువగా కాదు కానీ—) విదేశాలలో చిత్రకారులు ఏబొమ్మ గీయవలసి వచ్చినా, తాము వేయదలచిన ఆకారం, వైఖరివున్న మనిషిని వెదికి తీసుకొనివచ్చి వారిని తమకు కావలసిన భంగిమలలో నిల్పోబెట్టి, వారలా నిలచివుండగా చూచి బొమ్మలు గీసే ఆచారం అనాదినుంచీ వున్నది. లియనార్డో ముందుగా ఏసుక్రీస్తు బొమ్మ వేయటానికి గాను అట్టివ్యక్తి కోసం తెగ వెదికి చివరకు ఒక మనిషిని తీసుకొనివచ్చి కూర్చోబెట్టి ఆతని బొమ్మను గీశాడు. దానిని తాను రచించబోయే పెద్ద బొమ్మలో ప్రయోగించాడు. ఆ బొమ్మలో కనపరచిన భావాన్ని అందరూ నాటికీ నేటికీ ప్రస్తుతించారు. మిగిలిన 12 మంది బొమ్మలుకూడా అలాగే ఎవరెవరినో తీసుకొనివచ్చి వారిని కూర్చోబెట్టి పూర్తిచేశాడు. కానీ స్వామిద్రోహం చేసిన వ్యక్తి బొమ్మ వేయవలసి వచ్చేసరికి గట్టిచిక్కు వచ్చింది. అలాంటి ద్రోహబుద్ధి వుండే వ్యక్తి ముఖవైఖరి ఎలా వుంటుందని లియనార్డో తాను వూహించుకొన్నాడో, అటువంటి వ్యక్తికోసం నిర్విరామంగా వెతుకనారంభించాడు. కొన్ని ఏండ్లకు ఒక వ్యక్తి దొరికాడు. లియనార్డో సంతోష భరితుడై ఆతనిని తన స్టుడియోకు పిలుచుకొని వచ్చి అతనిని అలా కూర్చోబెట్టి తాను బొమ్మ గీయటం మొదలు పెట్టాడు. బొమ్మ వేయించుకొంటున్న వ్యక్తి చిత్రకారునితో ఆ కబురు యీ కబురు మాట్లాడుతూ "కొన్ని ఏండ్ల క్రితం ఎవరో ఒక చిత్రకారుడు ఏసు బొమ్మ వేయదలచి నన్నే తీసుకు వెళ్లి నా బొమ్మనే వేసుకొన్నాడ"ని గొప్పకోసమే కావచ్చు - బయట పెట్టాడు. లియనార్డో కుంచె అక్కడపెట్టి ఆ చిత్రకారుడు తానేనని చెప్పి "నాడు ఏసుక్రీస్తు బొమ్మకు మాత్రక కాగల ముఖ లక్షణాలున్న వ్యక్తివి, నేడు ఏసుక్రీస్తు పట్లస్వామి ద్రోహం

చేసిన వానితో పోల్చదగిన ముఖ వైఖరిని ఎలా సంపాదించావని! అడిగాడు బొమ్మ వేయించుకొంటున్న వ్యక్తి కళ్ళవెంట నీళ్లు తెచ్చుకొని, నిరుపేద అయిన తాను యిన్ని ఏండ్లలోనూ సంఘంచేత ఎంత హీనంగా చూడబడింది, దాని పర్యవసానంగా తాను సంఘంపై కచ్చకొద్దీ ఎట్టి కుచ్చితాలకు ఒడిగట్టిందీ వెళ్ల గ్రక్కుకున్నాడట. ఈకథ నిజానిజాల మాట ఎలావున్నా, మనసులో మలినం ఏర్పడిన కొద్దీ మానవుని ముఖంకూడా మారిపోతుందని చెప్పటానికి యిది చక్కని ఆధార మౌతుంది.

ఈతడు బొమ్మలు వేసే పద్ధతిలోకూడా ఏదో ఒక ప్రత్యేకత వుంటూనే వుండేది. ఎక్కడో పట్టణంలో చిట్ట చివరను పెద్ద చర్చిలో ఒకబొమ్మ వేయటం యితడు మొదలుపెట్టాడనుకో. ముందు బొగ్గుతో వేయదలచిన ఆకారాలన్నీ వేసి వచ్చేసేవాడు మళ్ళీ సంవత్సరమైనా దానిముఖం చూసేవాడు కాదు. ఇక మరి ఆ బొమ్మను యితడు ముట్టుకోడేమో అని అందరూ అనుమానించే స్థితి వచ్చినప్పుడు, వున్నట్లుండి మట్ట మధ్యాహ్నం కాలినడకను బయలుదేరి అక్కడకు వెళ్లి ఆబొమ్మకు కొన్ని సవరణలు చేసి వచ్చేవాడు. ఇదేమిటని ఎవరో అడిగితే "నా అంత సోమరీ లేడూ; నా అంతగా ఆగకుండా పని చేసినవ్యక్తీ లేడని" తానే చెప్పుకొన్నాడట.

ఈ వుత్తరంతో పాటు నీకు అందచేస్తున్న ఫోటో లియొనార్డో వ్రాసిన "మోనోలిసా" చిత్రానిది ఆ స్త్రీమూర్తి ముఖంలో కనుపిస్తున్న భావం ఏమిటో యిదమిద్ధమని ఎంతటి విమర్శకాగ్రేసరుడూ చెప్పలేక పోయాడు. ఈనాడు లియొనార్డో పేరు, విన్నప్పుడల్లా అన్ని దేశాల ప్రజలకు యీ మోనోలిసా చిత్రం కళ్ళకు కట్టినట్లు కనుపించి తీరుతుంది



మోనోలిసా

1502 లో లియొనార్డో సీజర్ బోర్జియా అనే మరొక రాజు కొలువులో ప్రవేశించాడు. అక్కడ యీయన హోదా చీఫ్ ఇంజనీరు. ఆ సందర్భంలో యీతడు తయారుచేసిన కొన్ని దేశపటాలు తప్పెన్నటానికి వీలులేనంత బాగా వున్నాయి.

అదే సమయంలో మైకలెంజెలో అనే మరొక సమర్థుడైన చిత్రకారుడు కూడా వుండేవాడు ఆయనకు యీయనకు వుప్పుకు నిప్పుకు వున్నంత సమాధ్య వుండేదట. వీరిద్దరూ ఒకసారి వీధిన్ని పడి కొట్టుకొన్నారట కూడా! లియొనార్డోకు సాదరీనీ అనే ఆయన ఒక పెద్ద చలవరాతి ముక్కను దానంచేసి ఏదైనాబొమ్మను చెక్కమన్నాడట. లియొనార్డో ఎందుకో నిర్లక్ష్యం చేశాడు తదనంతరం మైకలెంజలో యీ చలువరాతి ముక్కతోనే 'డేవిడ్' ప్రతిమను చెక్కాడు అది ప్రపంచ ప్రఖ్యాతశిల్పాలలో ఒకటి.

లియొనార్డో చేసిన పనులన్నిటినీ పేర్కొనాలంటే ఎంత వ్రాసినా తరుగదు. అతడు చేసిన పనులు ఎంత గొప్పవో తెలియ చెప్పటానికి ఒక్క ముక్క వ్రాస్తాను. నాడు అతడు వ్రాసుకొన్న 'నోట్సు' అన్నీ వెంటనే గనుక అచ్చుఅయి వుంటే, అనేక రంగాలలో శాస్త్రకారులు క్రొత్త విషయాలను కనిపెట్టటానికి పడ్డకష్టం సగానికి సగం, ఆ నోట్సు ఆధారంతో తప్పిపోయేది. గద్యరచనలో అతడు ఇటలీభాషకు ఒక వరవడి ఏర్పరిచాడు. అప్పటికి పెట్రోలు వంటిది కనుక కనుగొనబడివుంటే లియొనార్డో నిర్మించిన విమానం నిజంగా విమానమై ఎప్పుడో వుపయోగంలోకి వచ్చివుండేది. నీటి ఆవిరితో ఫిరంగులచేత పని చేయించవచ్చునని యీతడు ఆశించి, అందుకు సంబంధించిన కొన్ని స్కెచ్చులు వేశాడు కూడా. చలువరాతి క్వారీలలో యీనాటికీ వుపయోగించబడుతున్న రంపం యీతని సృష్టియే. ఇవన్నీ కాక ఆతడు పెద్ద వేదాంతి కూడా. ఈ విశేషణాలన్నీ ఆతని బుద్ధిబలాన్ని వ్యక్తపరిచేవే. ఆతని ఆకారాన్ని, ఆతని ఠీవిని వర్ణించటానికి మాటలు చాలవు ఎవరితో మాట్లాడినా చాలా సరసంగా మాట్లాడేవాడు. ఇన్ని విధాలుగా మెచ్చుకోదగిన వ్యక్తికనుకనే యీయనను పరిపూర్ణ వ్యక్తి అన్నారు. —వివెన్



“ది రివర్” చిత్రంలో శ్రీమతి రాధా శ్రీరామ్ భరతనాట్యంలో ఒక భంగిమ.



ప్రతి భారతీయ గృహంలోనూ శుభకార్యాల సమయంలో ముగ్గులు అలంకరిస్తారు. మనస్త్రీల చిత్రలేఖనం ముగ్గులతోనే ప్రారంభ మవుతుంది "ది రివర్" లోని ఈదృశ్యంలోని వారిద్దరు శ్రీమతులు రాధ, కరుణా సాహా.

# "ది రివర్" [నది] సమీక్ష

భారతదేశంలో తయారైన మొదటి టెక్నికలర్ చిత్రం "ది రివర్" గతబుధవారం మద్రాసు మినర్వా థియేటర్‌లో పత్రికలవారికి, ఇతరులకు మొదటి సారిగా చూపించబడింది గత శుక్రవారంనుండి న్యూ ఎల్ఫిన్‌స్టన్‌లో ప్రదర్శించబడుతున్నది హాలివుడ్ కు చెందిన కెన్నెత్ మెక్ ఎల్ డౌనీ ఈ చిత్రానికి నిర్మాత, దర్శకుడు జీన్‌రెనాయిర్, స్క్రీన్‌ప్లే వ్రాసినవారు రూమర్ గాడెన్, జీన్‌రెనాయిర్. నోరా స్విన్‌బర్న్, ఎస్మాండ్ నైట్, ఆర్థర్ షీల్డ్స్ మొదలైనవారు నటించారు

రూమర్ గాడెన్ అనే ఇంగ్లీషు రచయిత్రి బెంగాల్‌లో తన చిన్ననాటి అనుభవాలను వర్ణిస్తూ వ్రాసిన గ్రంథం ఆధారంగా చేసుకుని ఈ చిత్రం తీయబడింది "ది రివర్" లో ఇతివృత్తానికి ఎక్కువ ప్రాముఖ్యం లేదు. ఈ చిత్రం వినోదం కోసం ఉద్దేశించబడినది కాదు కాబట్టి ఇతివృత్తం లేకుండానే పాత్రల మనోభావాలను, మానసిక పరిణామాలను విశదంగా చిత్రిస్తూ కథ నడిపారు చిత్రం మొదటినుండి చివరవరకూ ఒక చక్కని కావ్యంలాగ నడిచిపోతుంది సంభాషణలు, సన్నివేశాలు కూడా కవితామయంగా ఉన్నాయి

కలకత్తావద్ద బారక్‌పూర్‌లో హుగ్లీ నదీ తీరాన ఒక ఇంగ్లీషు కుటుంబం ఉంటుంది జనపనార మిల్లులో అధికారిగా పనిచేస్తున్న తండ్రి, తల్లి, అయిదుగురు ఆడపిల్లలు, ఒక మగపిల్లడు—ఇదీ ఆ కుటుంబం పెద్దపిల్ల పధ్నాలుగేళ్ళ హారియట్. ఈమె ఆత్మకథే చిత్రంలో కథావస్తువు

హారియట్‌కు ఇద్దరు స్నేహితురాళ్లు ఉంటారు జనపనారమిల్లుయజమాని కుమార్తె వేలరీ (18 సం॥) ఒకామె. మరొకామె మెలానీ మెలానీ తండ్రి పేరు మిస్టర్ జాన్. అతను భారతీయ స్త్రీని వివాహమాడి భారతదేశంలోనే స్థిరపడిపోయాడు వేలరీ, మెలానీ కూడా హారియట్ ఇంటిపొరుగునే ఉంటారు కొంతకాలానికి కెప్టెన్ జాన్ అనే అమెరికన్ యువకుడు తన బంధువైన మిస్టర్ జాన్ ఇంటికి వస్తాడు కెప్టెన్ జాన్ యుద్ధంలో ఒక కాలు విరగకొట్టుకుని జీవితంలో ఏ విధమైన ఆశా, ఉత్సాహం లేని యువకుడు అతణ్ణి హారియట్, వేలరీ, మెలానీ ముగ్గురూ ప్రేమిస్తారు ముగ్గురికీ అదే మొదటి ప్రేమానుభవం ఈ అనుభవంలో ముగ్గురి అమాయిక హృదయాలు పరిణామం చెందుతాయి, ముగ్గురూ స్త్రీత్వంలో మరొక మెట్టు ఎక్కుతారు ముఖ్యంగా కథానాయిక హారియట్ అంతవరకూ బాల్యం యొక్క సంకుచిత ప్రపంచంలోనే ఉన్నదల్లా మొదటిసారిగా కెప్టెన్ జాన్ రాకతో జీవితపు లోతులు, జననం, మరణం, విషాదం, విశ్వాసం, ప్రేమ, ఈర్ష్య మొదలైన వివిధానుభూతులను రుచి చూస్తుంది చివరికి కెప్టెన్ జాన్ ఆమె జీవితంలోంచి వెళ్ళిపోతూ అంటాడు "నీ జీవితంలో ఏ చిన్న సంఘటన జరిగినా సరే—నీ దృష్టిలో ముఖ్యమైన ఏ మనిషిని కలుసుకున్నా సరే—నువ్వు కొంత మరణించటమో, కొంత

జన్మించటమో జరుగుతుంది" హారియట్ సమాధాన మిస్తుంది. "నీ రాకతో నేను జన్మించాను."

భారతీయ జీవనవిధానాన్ని యథాతథంగా ఇతరదేశాల ప్రేక్షకులకు పరిచయం చేసే ఉద్దేశ్యంతో నిర్మాతలు ఈ చిత్రం నిర్మించారు. మన నదులు, నదులకు ప్రజాజీవితాలకు గల భౌతిక, ఆధ్యాత్మిక సంబంధం, హోళీ, దీపావళి, కాళీపూజ మొదలైన పండుగలు, శుభకార్యాల సమయంలో చక్కని రంగవల్లులతో ఇళ్ళన్నీ అలంకరించటం, ఇంకా ఇలాటివే ఎన్నో భారతీయాచారాలు ఏ విధమైన పాక్షిక దృష్టి లేకుండా చిత్రించబడినవి ఈ చిత్రం పేరు "నది" భారతీయ నిత్య జీవితంపై నదుల కెంతో ప్రభావం ఉన్నది ముఖ్యంగా నదీతీరంలో ఉండే ప్రజలకు నదియే తల్లీ, తండ్రీ, దైవం, సర్వమూను ఇప్పటికీ గంగాతీరంలో ఉండే ప్రజలు ప్రతిరోజూ ఉభయసంధ్యల్లోను గంగానదికి పూజలు చేస్తూ ఉంటారు నదులు భారతదేశానికి ఆత్మవంటివి రాజ్యాలు వస్తాయి, రాజ్యాలు పోతాయి, భూకంపాలు వస్తాయి, భూమిస్వరూపం మారుతుంది, కాని పైపై మార్పులు ఎన్ని వచ్చినా, భారతీయ జీవితానికి అట్టడుగున గల పునాదులు మాత్రం మారవు నదిలో ఎన్నో తరంగాలు వస్తాయి, పోతాయి; వరదలు వస్తాయి, పోతాయి కాని నది మాత్రం మారదు నదిమాదిరిగానే భారతదేశపు ఆధ్యాత్మిక దృక్పథం, జీవితపు విలువలు కూడా మారవు అవి శాశ్వతాలు

ఈ మహత్తర సత్యం నిరూపించటానికే 'ది రివర్' చిత్రంలో నిర్మాతలు కృషి చేశారు

ఈ చిత్రంలో ముగ్గురు నలుగురు తప్ప మిగతా నటీనటులంతా ఇదివర కెప్పుడూ తెరమీద కనిపించని కొత్తవారే తారలు కానివారితో చిత్రాలు తీయటం హాలీవుడ్‌లో ఆచారం కాదు కాని మెక్ ఎల్ డోనీ సాహసించి కొత్తవారితోనే చిత్రం తీయగలిగాడు.

భారతీయ నటీనటులలో ముఖ్యంగా పేర్కొనవలసింది మెలానీ పాత్ర ధరించిన శ్రీమతి రాధా శ్రీరాం ఈమె తంజావూరు నాట్యశాస్త్రజ్ఞులైన చొక్కలింగం పిళ్లె శిష్యురాలు అడయారు కళాక్షేత్రంలో నాట్యం అభ్యసించింది ఈమె "ది రివర్"లో ప్రియుని చూసిన సంతోషావేగంలో ప్రియురాలికి కలిగే అనుభూతిని చూపిస్తూ అద్భుతమైన నాట్యం చేసింది ఈ నాట్యం భరతశాస్త్ర సంప్రదాయాలకు బద్ధమై ఉండి కూడా ఆధునిక ప్రేక్షకులకు ఆహ్లాదకరంగా ఉంది అయితే బెంగాల్‌లోని ఆంగ్లోఇండియన్ పాత్ర చేత దాక్షిణాత్య నాట్యం చేయించటం అసందర్భంగానే ఉందని చెప్పాలి చిత్రంలో ప్రేక్షకులను సమ్మోహింపజేయగల సంగీతం ఉన్నది మన సినిమాలలోవలె కథా గమనానికి అడ్డంవచ్చేటట్లు కాకుండా ఉన్న కొద్ది నేపథ్యగీతాలు, నేపథ్య వాద్యసంగీతం రసోత్పాదకమైనవిగా ఉన్నవి కాని మళ్లీ ఇక్కడకూడా ఇందాకటి లోపమే జరిగింది బెంగాల్ జీవితంలోకి దాక్షిణాత్యసంగీతం ఇరికించబడింది.

ఇంగ్లీషునటీనటుల్లో హారియట్ తమ్ముడుపాత్ర ధరించిన రిచర్డ్ ఫాస్టర్ అనే బాలుడు చక్కగా నటించాడు ఆ పాత్రలో ఒక విశేషం ఉన్నది అతను వీధిలో పాము మంత్రగాడు తాచుపాములను ఆడించటం చూస్తాడు తను కూడా పాములను ఆడించాలనే పిచ్చిలోపడి ఇంట్లో ఎవరికీ తెలియకుండా నాగస్వరం పుచ్చుకుని తాచుపామును ఆడించబోతాడు



భారతీయ జీవన విధాన్ని ఇతర దేశీయులకు పరిచయంచేసే చిత్రం "దిరివర్". అందులోని ఒక దృశ్యం ఇది.



రాగిణీవారి "ధర్మదేవత" లో శాంతకుమారి, గిరిజ.

కొద్దిరోజుల తరవాత ఆ తాచుపాము అతన్ని కాటు వేస్తుంది అతను చనిపోతాడు కథలోకల్లా హృదయాల్ని ద్రవింపజేయగల ఘట్టం ఇదే

ప్రస్తుతం పాశ్చాత్య దేశాలలో సారస్వతం, చిత్రకళ మొదలైన అన్నిటిలోనూ ఆధ్యాత్మిక వాదం (*Mysticism*) ప్రభావం ఎక్కువగా కనిపిస్తోంది "ది రివర్" లో కూడా ఇది ప్రబలంగా కనిపిస్తుంది

టెక్నికల్ దృష్ట్యా చూస్తే ఇది ఉత్తమ చిత్రాలలో ఒకటని నిస్సంశయంగా చెప్పవచ్చును దీనికి అంతర్జాతీయ బహుమతి రావటానికి కూడా కారణం ఇదే కావచ్చును టెక్నికలర్ ఛాయాగ్రహణం, వర్ణ సమ్మేళనం సాధారణంగా హాలీవుడ్ లో తయారయ్యే చిత్రాలకంటే ఉత్తమ స్థాయిలో ఉన్నాయి టెక్నికలర్ కెమేరా భారతీయ ప్రకృతిసౌందర్యాన్ని నాటికి నూరుపాళ్లు తెరమీది కెక్కించగలిగింది మన నదులు, చెట్లు, పువ్వులు, మైదానాలు మనోహరరూపంలో తెరమీద సాక్షాత్కరిస్తాయి అసలు కథకంటే హుగ్లీ దృశ్యాలు, మైదానదృశ్యాలు ధ్వనింపజేసే కథే ప్రేక్షకులను బలంగా ఆకర్షిస్తుంది బలమైన కథే వుంటే కెమేరా దర్శకుడు క్లాడ్ రెనాయిర్ ప్రతిభ ద్విగుణీకృతమైన ఫలితాలు ఇవ్వగలిగేది

"ది రివర్" నుండి భారతీయ చిత్రనిర్మాతలు నేర్చుకోవలసిన అంశాలు చాలా ఉన్నాయి మన నిర్మాతలు కాకమ్మకథలు తీసుకుని రాజుల భవనాలు, పాతాళలోకాలు, వగైరా అభూత కల్పనా దృశ్యాలు చూపించటంకోసం అమితమైన ధనం వెచ్చిస్తున్నారు కృత్రిమమైన సెట్టింగులకోసం ధనవ్యయం చేసేకంటే ప్రకృతి సౌందర్యానికి పుట్టినిల్లయిన మన దేశపు దృశ్యాలను వినియోగించుకోవటం తెలివైన పని

## ఆడబ్రతుకు

వి ఎన్ ప్రొడక్షన్స్ వారి జానపద చిత్రం "ఆడబ్రతుకు" మొన్న "రాజకుమారి"లో పత్రికలవారికి చూపించారు నిర్మాత, శ్రీ వి నరసయ్య కవి, కథకుడు శ్రీ తాపీధర్మారావు దర్శకుడు శ్రీ బి వీ. సుబ్బారావు, సంగీతం, ఓగిరాల, ఛాయ మారి, స్టూడియో శోభనాచల

ప్రధాన పాత్రధారులు: రఘురామయ్య, శ్రీరంజని, కనకం, సీతారామయ్య, రామమూర్తి, బేబీమల్లిక, కృష్ణకుమారి, కోటేశ్వరరావు, ఏ ఎల్ నారాయణ, వి వి సుబ్బారావు

ఈ చిత్రం కథ స్థూలంగా ఇది ఇద్దరు మిత్రులు స్త్రీపాతివ్రత్యాన్ని గురించి పోటీ పడుతారు ఒకడు తన మిత్రుని భార్య శీలాన్నే ధ్వంసం చేస్తానని శపథంపట్టి వంచనద్వారా ఆమె శీలాన్ని పాడుచేసి



ఆర్. పద్మనాభన్ వారి "రంజేశ్వరి"లో శ్రీరామమూర్తి.

శుభోదయా వారి "ఆదర్శం"లో జగ్గయ్య, జానకి.

నట్లు ఇతరిని నమ్మిస్తాడు ఇతడు నమ్మి ఆమెను చంపివేయమని సేవకునికి ఆజ్ఞా పిస్తాడు మతిచాంచల్యం వల్ల వేశ్యా లోలుడై తన కుమార్తెతో కూడ వేశ్య ఇంట్లో చేరి ఆమెకు కాలక్షేపంగా దాసాను దాసుడౌతాడు సేవకుడు చంపకుండా వదలగా భార్య తన పతిజాడ వెతుకుతూ బైలుదేరుతుంది వేశ్యపోరు పడలేక కూతురు పారిపోతుంది చివరికి తండ్రి, తల్లి, కుమార్తె కలుసుకుంటారు తండ్రి తన పొరపాటు గ్రహించి క్షమ అర్థిస్తాడు కథ సుఖాంతంగా ముగుస్తుంది.

పతి విరహిత అయిన భార్య (శ్రీరంజని) అడుగడుగునా పడేకష్టాలు, వేశ్య (కనకం) ఇంట్లో కుమార్తె (బేబీమల్లిక, కృష్ణకుమారి) పడేఅగచాట్లు ప్రేక్షకులను కదిలించి కన్ను చెమ్మగిల చేస్తాయి చిత్రం ఎక్కువగా ఆడవారి అభిమానం పొందగలదు.

టెక్నికల్‌గా చిత్రాన్ని గురించి చెప్ప దగింది ఏమీలేదు సంగీతం ఓగిరాల వారిదైనా ఇదివరకటి పాకం కనిపించలేదు చిత్రానికల్లా మెరుగునిచ్చింది నేరాన్ని నిరూపించే "మూక నాటకం" ఈతావులో మాత్రం ఛాయాగ్రహణం కూడా ఉత్తమంగా వుంది

కథ నడక కుంటుపోకుండా సాఫీగా నడవటం మూలాన చిత్రం ప్రజారంజకంగా వుండగలదు నటీనటులు కూడాశక్తి వంచనలేకుండా నిర్వహించినందువల్ల మొత్తంమీద చిత్రం విజయవంతం కాగలదని ఆశించవచ్చు





అంజలీవారి "పరదేశి"లో రంగారావు, అంజలి

# సినిమా వార్తలు

శ్రీ డి ఎస్ సదాశివరావుగారు "ఈశ్వర్ పిక్చర్స్" అనే క్రొత్తసంస్థను సాపించారు మై బ్రదర్ అనే సాంఘికచిత్రాన్ని వీరు నిర్మిస్తున్నారు త్వరలోనే సెట్స్‌మీదికి వెడతారనీ, పాటల రికార్డింగు జరుగుతున్నదనీ తెలుస్తోంది ఈ చిత్రానికి దర్శకుడు సదాశివరావుగారే, మాటలు, పాటలు కణ్వశ్రీ, సంగీతం మల్లిక్, కళా దర్శకుడు వాలి

* * *

ఈ ఏడు జూన్ 12 నుండి 25 వరకూ బెర్లిన్‌లో అంతర్జాతీయ చలనచిత్రోత్సవం జరగబోతోంది ఉత్సవసంఘంవారు తమిళచిత్ర నిర్మాత, దర్శకుడు కె సుబ్రహ్మణ్యంగారిని ఉత్సవానికి ఆహ్వానించారు. ఆయన బెర్లిన్ వెళ్ళేటప్పుడు మరి ఇద్దరు నటులనుకూడా వెంటపెట్టుకుని వెడతారట బెర్లిన్ ఉత్సవంలో సుబ్రహ్మణ్యంగారి "త్యాగభూమి" అనే చిత్రం ప్రదర్శించబడుతుంది ఈ చిత్రానికి జర్మన్ భాషలో మాటలు కూర్చి చూపిస్తారట బెర్లిన్‌లో ఉన్న పదిహేనుగోజులూ భారతీయ ప్రతినిధులకు బెర్లిన్ అధికారులే ఆతిథ్యమిస్తారు ఈ ఉత్సవంలో భారతప్రభుత్వపు ఫిల్ముశాఖకు కూడా ప్రాతినిధ్యం వుంటుంది ఫిల్ముశాఖవారి ఫిల్ములు కొన్ని ప్రదర్శించబడతాయి ★



జంపనవారి "మేనరికం"లో సావిత్రి, సీత

# తెలియని వ్యధ

(5-వ పేజీ తరువాయి)

కొన్ని క్షణాలు; అందరివైపూ నిశ్చలంగా చూస్తూ.

'ఎవరి పోలికే?' అని తల్లి రెట్టించింది.

'మీ అల్లుడిపోలికే. అచ్చంగా ఆయన పోలికే' ప్రతీమాట, స్పష్టంగానూ, నెమ్మదిగా అంది.

ఎవరూ నోరెత్తలేదు. వాళ్ళంతా దిగ్భ్రమ చెందారు. సౌజన్యారావు జేబురుమాలుతో నుదురుని తుడుచుకున్నాడు. శాంత కళ్లల్లో గిరుక్కున నీళ్లు తిరగేయి. సౌజన్యారావుకూడా చలించేడు ఈవార్తని విని. 'అదంతా తప్పయి వుంటుంది సరూ' అన్నాడు.

'నేనూ ఇలాగే అనుకున్నాను నాన్నా. తరువాత నేనంతా తెలుసుకుని యధార్థం అని నమ్మక తప్పిందికాదు'

'నీ భర్త నడిగావా?'

'ఇంకేం చేయను నాన్నా! ఆ సాయంత్రమే వారు క్యాంపునుంచి తిరిగివచ్చి ఆసుపత్రికి వచ్చి నన్ను కలుసుకున్నారు. నే నడిగాను ఆయన్ని...

'ఆయనతో ఈ గాథ అంతా చెప్పా. ఒప్పుకున్నారు తనే తండ్రినని.

'ఏం దాచకుండా నిజం చెప్పినందుకు ఆయన్ని అభినందించాలి. నా సానుభూతిని తెలియచేశా. ఆమె జీవితాన్నిలా ధ్వంసం చేయటమేనా అని ప్రశ్నించా. ఆయన మౌనంగా ఊరుకున్నారు.

'అందుకే ఒక నిర్ణయానికి వచ్చాను. నేను ఆయనతో స్పష్టంగా చెప్పాను. నా స్థానాన్నామె ఆక్రమిస్తుందని.'

తండ్రి కళ్ళల్లోంచి జలజలా ప్రవాహంలా పొంగివచ్చాయి దుఃఖసముద్రపు అలలు. తండ్రిలేచి ఆమె చేతులు తీసుకొని వాత్సల్యంతో ఆమెను చేరదీసుకొన్నాడు.

'ఎందుకు చెప్పావు కాదమ్మా-ఇదంతా. ఇంతకాలం కప్పిపుచ్చి మనస్సులో కుములుతున్నావా!' అన్నాడు.

'నేనెలా చెప్పగలను నాన్నా! నా మనస్సులో ఎంత బాధగా వుందో. నాకు పిల్లాడు పోయాడు. లోకంమీద విశ్వాసం నశించింది. మీ కెవరికీ అర్థంకాని బాధ నా బాధ.' ఇంక ఆపుచేసుకోలేక ఒక్కసారి మళ్ళీ దుఃఖం పొంగింది.

'నాకంతా అర్థమయింది తల్లీ. ఏడవకమ్మా. నీ తప్పేమీ లేదు.' అని ఆమె కళ్లనీళ్లు జేబురుమాలుతో తుడిచాడు సౌజన్యారావు. ★

# రాజాజీ మంత్రివర్గం

(2-వ పేజీ తరువాయి)

దన్నారు. కుల వర్గ వ్యత్యాసాలను గురించీ వాటికి సంబంధించిన వైరాలను గురించీ చిత్రమైన భావాలు ప్రచారంలోకి వచ్చాయి. సమాజ సమధర్మం అనే మాటకు కూడా విచిత్రమైన అర్థాలు తీస్తున్నారు. గత ఆరేళ్ళ పరిపాలనలోనూ ఈ విచిత్రమైన అర్థాలనే అన్వయించుకుని అధికారం కలవారూ లేనివారూ కూడా ప్రవర్తించారు. ఇప్పుడా విధానం మారితేగాని కార్యక్రమాలు సవ్యంగా కొనసాగడం, ప్రజలు తోడ్పడ్డం సంభవించవు. పార్టీలనూ ప్రత్యేక వర్గాలనూ తృప్తిపరిచి రాజకీయరంగంలో చదరంగమాడ్డం నేర్చుకున్నవారు ఈ వింత ఉచ్చులనించి తప్పించుకోలేక, తమ కిష్టంలేని విధానాన్ని అనుసరిస్తూ సమర్థించుకో యత్నించడం జరిగింది. శ్రీ రాజగోపాలాచారిగారి మంత్రివర్గానికి ఈ ఉచ్చుల్ని విదల్చుకుని దేశానికీ, సమాజానికీ అవసరమైనవని భావించే విధానాల ననుసరించగల అవకాశం ఉంది.

ఆంధ్రదేశసమస్యలపట్ల మద్రాసు ప్రభుత్వం అశ్రద్ధ చూపుతున్నదనే విమర్శను తోసిపుచ్చినందువల్ల ఫలితం ఉండదు. రాయలసీమలో మంచినీటి సదుపాయం, ఇరిగేషన్ సదుపాయాలూ, సర్కార్లలో ఇరిగేషన్ అభివృద్ధి, ఉభయ ప్రాంతాలలోనూ విద్యుచ్ఛక్తి అభివృద్ధి, విద్యావ్యాపన కార్యక్రమాలు, చెన్నపట్నంలో తెలుగువారికి తెలుగులో విద్యాబోధ మొదలైన అంశాలలో అన్యాయం జరగలేదని ఎవ్వరూ అనలేరు. ఈ అన్యాయాలకు ఎవరు కారకులనే ప్రశ్నను విడిచిపెట్టి ఇప్పుడు లోపాలున్నవా లేదా అనే విషయాన్ని పరిశీలించి ఇకనుంచి ప్రభుత్వ కార్యక్రమాల్ని తదనుగుణంగా సవరించడం అవసరమౌతుంది. ఆంధ్రులూ తమిళులూ సమష్టిగా ఒక్క రాష్ట్రంలో ఉండి ఒక్క ప్రభుత్వాన్ని నెరపుకోగలరని నిరూపించడానికీ, ఆంధ్రుల అవసరాలు తమిళులకు హానికరమైనవి కావనీ, తమిళుల పరిపాలనా విధానం ఆంధ్రులకు కూడా ప్రయోజనకరంగా ఉండగలదనీ నిరూపించడానికీ తుది అవకాశం రాజాజీ మంత్రివర్గంపైన పడుతున్నదనిపిస్తుంది. ప్రాంతీయ వ్యత్యాసాలను మరిచిపోవాలంటే ముందుగా ఇది నిరూపించబడాలి. కాంగ్రెస్ ప్రభుత్వం అయిదేళ్లూ సుస్థిరంగా పరిపాలించాలంటే అది ఆంధ్రదేశ సమస్యలపైనా ఆహార సమస్యపైనా ఆధారపడి ఉంటుందని నేటి రాజకీయ పరిస్థితిని పరిశీలించినవారికి తోచక మానదు ★

# మద్రాస్ డైరీ

(3-వ పేజీ తరువాయి)

దొయ్యడం అనేమాట బొత్తిగా పాతది. ఇదివరలో దొంగలు గునపాలతో గోతులు తవ్వి కన్నాలేసి ఇంట్లో దూరిచడీచప్పుడూ లేకుండా నగలూ నాణ్యాలూ ఎత్తుకుపోయేవారు. ఇప్పుడు దొంగలు తెలివిమీరి స్క్రూలూ, ఊచలూ పట్టకార్లూ ఉపయోగించి తాళాలు తెరుస్తున్నారు. ఇంటివాళ్లు నిద్రలో ఉన్నప్పుడే ఇవి సాగుతాయి. కాబట్టి నిద్రాభంగం కలక్కుండా నిశ్శబ్దంగా పనికానిచ్చుకుపోడానికి దొంగలు రిసెర్చి చేస్తూ ఉంటారు. దారికోపిడికైతే సాహసం, ధైర్యం, బలం అవసరం. అంటే చెన్నపట్నంలో ఒక ప్రత్యేకవృత్తి ఉన్నవారు చాటుమాటు వ్యవహారం మానేసి స్వాతంత్ర్యసిద్ధితో సాహసం తెచ్చుకుంటున్నారన్నమాట. కొందరు ఈ సాహసానికి ఇటీవల జరిగిన ఎన్నికలు ఆధారం అంటారు. ఏమో! దీనిగురించి పరిశోధన జరగాలి.

నా మాట—

దిష్టిబొమ్మ: 'కావు కావు' మని పది కాకులు పోగై నెత్తిమీద గోలచేసినా నిర్వికార భావంతో అనంతంలోకి చూస్తూ ఉండిపోయేది.

—ఎస్సార్.

# భాగ్యరేఖ

(15-వ పేజీ తరువాయి)

ఉదయమే వచ్చారు. భోజనాలు అయిన తర్వాత విశ్రమించి మధ్యాహ్నం పూట పేక ఆడుతున్నాము. నేనూ, మా మేనత్త కొడుకు బిహారీచంద్రుడూ మరి యిద్దరమూ ఆడుతున్నాము. ముక్కలు పంచటం అయింది. నేను రెండు డయమండ్సు చెప్పాను. వాళ్లు రెండు, రాయల్సు అన్నారు; మా 'బావ' రెండు నోట్రంపు అన్నాడు. ఆట నిలిచింది. నా ముక్కలు పరచి మా బావదగ్గర ముక్కలు తీసుకొన్నాను. వాడి రెండు చేతులూ చాచి చూడు ఎలాగున్నాయో ముక్కలు అన్నాడు. వాడిచేతిలో ముక్కలకంటే వాడి చేతిలో రేఖలు నన్ను ఆకర్షించాయి. ఏదీ! యిలాగ చూడనీ! అని వాడి చేయి చూచాను. అందరూ ఆశ్చర్యంతో నాకేసి చూస్తున్నారు.

"ఏమిటి బావా! కొత్తవిశేషం కనిపిస్తూ ఉందా?" అన్నాడు.

"వాడికి పెళ్ళి ఎపుడు అవుతుందో చెప్పరా బికారీ!" అని మిగిలినవాళ్లు పట్టుకున్నారు. నేను కొంతసేపు మౌనంగా చూస్తూ ఊరుకున్నాను. చాల గొప్ప విశేషం కనిపించింది. ఆ పడుచువాడికి ఆ రాత్రి వివాహం అవుతుందని నేను చెప్పివేశాను.

"అసంభవం" అని అందరూ పెదవులు విరిచేశారు. 'చూడండి ఏమి జరుగుతుందో' అని తిరిగి మా ఆట సాగించాను.

ఆ వేళ సాయంకాలం రావలసిన పెళ్ళికొడుకువాళ్లు వచ్చారు. రాగానే మా నాన్నగారు వెళ్ళిచూచారు. సాయంకాలం ప్రధానంలో వాళ్లు పెట్టవలసిన వెయ్యి రూపాయల నగలు 'లక్ష్మి' ఒంటిమీద పెట్టవలసి ఉంది. కాని వాళ్ళు పెట్టలేదు. పెట్టకపోతే మా నాన్నకి చాల ఆగ్రహం వచ్చింది. దానిమీద వాళ్లు మాటలు మిగిలారు. మా వంశ, సంప్రదాయం వీటిమీద విమర్శ బయలు దేరదీశారు. ఇలాంటి వాళ్ళతో నిమిత్తం ఏమిటి అని మా నాన్న ఊరుకున్నాడు.

ఆడపిల్ల గలవాళ్లు ఆగ్రహపడకూడదని మా నాన్నని అంతా సమాధాన పరచారు. ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఆయనకి అసలు కోపం రాకపోవాలిగాని వస్తే దాని అంతు చూడవలసిందే.

ఆడపిల్ల గలవాళ్ళకే అంత అహంకారం అయితే మాకేనా తక్కువయింది అని పెళ్ళికొడుకు తండ్రి మరింత బిట్టబిగిశాడు. మా పిల్లవాడికి పెళ్లికాకపోతే చూస్తాం—రండి—పోదాం పదండిరా అని నిలుచున్న పాటున లేచి వెళ్లిపోయారు.

మా నాన్నకి చాల పరాభవం అయిపోయింది. వాళ్ళమీద కక్షి తీర్చుకోవడానికయినా సరే ఆ ముహూర్తానికి పెళ్లి జేసితీరాలని ఆయన పట్టుదల. లక్ష్మికి వరుస కలిసిన పిల్లవాడు, పెళ్లికి వచ్చిన వాళ్ళల్లో ఎవరైనా ఉంటారేమో అని చూచాడు. మా మేనత్త కొడుకు బిహారీచంద్రుడు ఉండనే ఉన్నాడు. పిల్లకీ అందరికీ వాడంటే ఇష్టమే. ఒక్క అభ్యంతరం అల్లా మా నాన్నదే. 'నాయనా! క్షమించు ఇంటిలో కల్పవృక్షాన్ని పెట్టుకొని ఊరంతా వెదకాను; కాళ్ళు కడిగి కన్యాధార చేస్తాను! రా!' అని పిలిచాడు. మా అత్తయ్యముఖం, లక్ష్మిముఖం పద్మాలులాగ వికసించాయి. మేమందరమూ ఒక్కసారి విభ్రాంతి పడ్డాం కాని—చివరికి జరిగినదానికి అందరికీ ఎంతో ఆనందమయింది.

నేను చెప్పిన భవిష్యత్ ఫలాలు లక్ష్మి విషయంలోనూ, బిహారీ విషయంలోనూ అక్షరాలా నిజమయ్యాయి. ఆ పెళ్ళిలో నా హస్తసాముద్రిక కీర్తి మరింత విస్తరిల్లింది. అప్పటినించీ ఇక వృత్తిగా జీవిస్తున్నాను. ఎవ్వరికి నేను భవిష్యత్ చెప్పినా నేను ప్రతిఫలం కోరను. వాళ్లే స్వయంగా తమకు తోచింది యిస్తారు. చాలచోట్ల చెప్పినవి నిజం అవుతాయని అంటారు.

ఈ కథంతా వినగానే నేనూ, ఆచార్యాకూడా తిరిగి బికారీని మా భవిష్యత్తు గురించి ప్రశ్నించాలని బుద్ధిపుట్టింది.

ఇద్దరమూ చేతులు సాచాము.

ఇదివరకు మీకు చెప్పానుకదా అని బికారీ తప్పుకున్నాడు. కాని మేము మాత్రం మాకు మనస్కరించాలని తోచిన ఫలితాలు అతనిచేత చెప్పించుకోవాలనే పట్టుదలలో ఉన్నాం. 'అయితే నాకు బదిలీ ఎపుడు అవుతుంది' అని నేను అడిగాను.

'ప్రమోషన్, వివాహం' ఎప్పుడు అని ఆచార్య అడిగాడు.

మా ఉభయుల ప్రశ్నలకీ సమాధానాలు చెప్పాడు. ఇదివరకు వ్రాసింది కాకుండా మళ్ళీ వ్రాసి యిచ్చాడు.

అది తీసుకొన్న తర్వాత 'బికారీ' వెళ్లిపోయాడు. కొన్ని మాసాలు గడిచిపోయాయి.

ఆచార్యాకు బదిలీ అయిపోయింది. నాకు బదిలీ కాలేదు. తిరిగి ఆచార్యాను అతడున్న కొత్త స్థలంలో నేను కలుసుకోవడం తటస్థించింది. తిరిగి బికారీ ప్రసక్తి వచ్చింది. ఏమిటి మన భాగ్యరేఖ ఎలాగ ఉన్నది. బికారీ వ్రాసి యిచ్చిన కాగితాలు తెరచి చదువుకున్నాం. మా ఇద్దరివిషయాలలోనూ 'బికారీ' చెప్పిన జోశ్యం విఫలం అయిపోయింది. ఒకరి ముఖం ఒకరము చూచుకొన్నాం. భాగ్యరేఖ ప్రతివాడికీ ముందే నిర్ణయం అయిపోయిఉంటుంది. దానిని చెరపడానికీ మార్చడానికీ ఎవ్వరి తరమూ కాదు. కాని మన అవసరంకొద్దీ, ఏవో స్వప్నవాంఛలు కోరుతూ ఆ భాగ్యరేఖలో లేని ఫలితాలు చదువుకోడానికీ, చదివించుకోడానికీ ప్రయత్నం చేస్తాం. యధార్థం కాని తీయని తలపులు సృష్టించుకొని భవిష్యత్తులో జీవిస్తాం. ఆ భవిష్యత్తు చెదరిపోయి తిరిగి నగ్నమైన వర్తమానం కాగానే చీదరించుకొంటూ అనుభవిస్తాం.

'ఆచార్య సాబ్! ఏమిటి మన భాగ్యరేఖ! ఎప్పటికి నాకు బదలీ? ఎప్పుడు నా ప్రమోషన్' అని అడిగాను.

జీవితంలో ట్రాన్స్ఫరులూ, ప్రమోషన్లూకంటే ఎన్నో విలువైన విషయాలు ఉన్నాయి. ఇది మరిచిపో—మనం బ్రతుకుతున్న జీవితమే—మామూలు మనుగడ.

★





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7. Thambu Chetty St., Madr:

# మైలాపూర్ కపాలీశ్వర దేవాలయ రథోత్సవం



గుడి, రథం





రథయాత్ర

ఛాయాచిత్రకారుడు
శ్రీ దశిక రామలింగేశ్వరరావు



Regd No M 4479